పూజ్యమిత్రుఁడు

## శ్రీ సూర్యదేవర మల్లికార్జునరావునకు

అన్నల్ దమ్ములు లేని విన్నగని 'అన్నా !' యంచు నేఁ బిల్వఁగా
నన్నల్ దమ్ములు లేని నన్నుఁగని 'అన్నా !' యంచు నీ పిల్పుటల్
విన్నారెన్నఁడొ తాతపాదులును సంప్రీతాత్ములై, సోదరా,
యెన్నోజన్మల సౌహృదంబులు గదా యీ రాగ యోగంబులున్ !

ఏ నొక తేటగీతి రచియింపఁగ నీ కది గొప్పయై యదే
దే నొక కావ్యవైఖరి వహించి బుధస్తుతులంద మెచ్చి, య
ద్దైనదొ లేదొ చూచుకొనునట్టి మదాప్త సుహృన్మణీ ! త్వదా
శా నవమల్లికా ప్రసవసౌరభ మీకృతి మోసి తెచ్చెడున్.

అంకిత మిత్తునన్న వలదంటివి; యిర్వురి జీవితంబులే
అంకితమై పరస్పరము, అచ్చపు నెయ్యపుఁ దియ్యతేనె లి
ర్వంకలఁజింద 'అంకితము - పద్యము' లేల యటందు; వైన నే
వింకఁ ద్వదీయమౌ ఋణము వీఁగుట కల్లయ మల్లికార్జునా !

కావున మధ్యేమార్గము
భావించి మదీయకృతిని త్యజించకుండా
శ్రీ వేంకటప్పయార్యుని
పావనహస్తముల నుంచి ప్రణతి యొనర్తున్.

తన పశుపోషకతాదీక్ష బహుకృషీ
వల బృందముల కొజ్జబంతి గాఁగ
తన మహావ్యవసాయ దక్షత కర్షక
ప్రకరమ్ములకు నొరవళ్లు దిద్ద
తన మహౌదార్య తత్పరత యాచకకోటి
కాఁకలి దప్పుల యార్తిఁ దీర్ప
తన ప్రవృత్తి నివృత్తి తాత్పర్యములు పురా
రాజయోగుల ముక్తి రక్తిఁ దెలుప

వెలయు శ్రీ వేంకటప్పయ్య విశదకీర్తి
మత్కృతిస్వామియై పరమప్రమోద
మేదురంబైన చిఱునవ్వు మెరపె నదిగో।
చాలు నది, మల్లికార్జున, చాలు నాకు !!!

— వా. వేం. ల. నరసింహారావు

# కావ్యతత్త్వప్రకాశిక

## కవిసమ్రాట్

## శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు

ఈ గ్రంథకర్త శ్రీ వాసిలి వేంకటలక్ష్మీనరసింహారావుగారు. వీరు ప్రస్తుతము రాజమహేంద్రవరమునందలి రాష్ట్రీకపు కళాశాలలో నాంధ్ర భాషాశాఖాధ్యక్షులు. నాకు మున్ను వీరితో నంతపరిచయము కలదు. మున్నాళ్ళ క్రిందట నాకడకువచ్చి "నేనొక చిన్ని పాత్రమును వ్రాసితిని మీ కందందు కొన్ని పద్యములు వినిపింతును, మీరొక అభిప్రాయ మిచ్చినచో నేను దానిని తీసికొనిపోయి ముద్రింపించికొందు" నని చెప్పిరి. సరే యని వినగా వారు వినిపించిన పద్యముల రచన నాకు మిక్కిలి యాహ్లాదము కలిగించినది. "ఇట్లుకాదు, నేను పాత్రమంతయు వినవలతును, విన్న తరువాత నాకు తోచినది వ్రాయుదును." అనగా వారు 'వల్లి' యని రెణ్ణాళ్లే విజయవాడలో నుండి నాకు పాత్రమంతయు వినిపించిరి.

తొలుత వారందందు వినిపించిన పద్యములు రచనచేత, మాధుర్యముచేత, వర్ణనయందలి స్వాతంత్ర్యముచేత, తద్గతౌచిత్యముచేత నన్నాకర్షించినవి. పాత్రము చిన్నదైనను సంపూర్ణముగా విన్నతరువాత మొదట నన్నాకర్షించిన కవితాగుణములను మించి, మఱి యేదో ఒక మహావిషయము నేను తొలుత వ్రాయదలచుకొన్న మాటల ధోరణిని మార్చివేసినది.

ఇది చిన్నకథ. ఆనందుడు బుద్ధుని ప్రధాన శిష్యులలో నొకడు. ఒకనా డతడు మాలకన్నియ యొకర్తుకచేత నీరు పోయించుకొని త్రాగుట తటస్థించినది. బౌద్ధమతము వర్ణాశ్రమ విరుద్ధమైనది. తదాచారములు పాటించదు. ఆ యాచారములు మానవసమానత్వ సహజత్వ

విరుద్ధములని బౌద్ధమత భావన. అందుచేత ఆనందు డామె చేతి నీరములు గ్రోలెను. తదాచార బద్ధమైన సంఘజీవనమున కలవాటు పడిన యా మాలకన్నియ యానందునీ సర్వమానవ సమానత్వ భావనము నర్థము చేసి కొనలేక వానిని ప్రేమించినది. ఇట్టి ప్రేమ యెప్పుడును కొనసాగునది కాదు. ఇంతకు మించి యీ కథలో నొక విశేష మున్నది. ఈ మాలపిల్ల పేరు ప్రకృతి. ఆమె తల్లి పెద్ద మాంత్రికురాలు. కూతునభిలాష తీర్ప నామె యానందుని తన మంత్రబలముచేత నాకర్షించినది. మంత్రశక్తిచేత నానందు డాకర్షింపబడెను. అతని యాత్మకు మంత్రశక్తి నతిశయించిన శక్తికలదుగాని వానిదేహమునకు లేదు.

ఆత్మశక్తి, మంత్రశక్తి—ఈ రెంటికిని గల యుద్ధ మీ కథయందలి ప్రధాన వస్తువని చెప్పవచ్చును.

ఈ కథ మున్ను రవీంద్రుడు రెండురంగముల నాటికగా రచించెను. దానిపేరు 'చండాలిక'. ఈ గాథ పుక్కిటిపురాణమో, గ్రంథస్థమై యున్నదో తెలియదు. ప్రకృతియొక్క తల్లి యానందు నాకర్షించుట రవీంద్రుని నాటికలో సూచింపబడినది. దానిని శ్రీ లక్ష్మీనరసింహారావు గారు తీసికొని విస్తరించి వ్రాసిరి.

ఇం కొక్కటి చెప్పవలసి వచ్చినది. వీరు కులముచేత విశ్వ బ్రాహ్మణులు. ఇది యెందుకు చెప్పవలయు ననగా మనదేశమున ననాది నుండియు బహుమంత్రశక్తులు తత్కులము వారి యందుండెడివి. 'మాచాబత్తులవారి' ప్రశస్తి తెలుగునాట సంప్రదాయము చావని నాట తెలిసిన విషయమే. దాని ప్రసక్తి యేమన ఆ మంత్రశాస్త్ర గ్రంథములు నేటికిని వారి యిండ్లలో నుండుటయు వాని నంతో యింతో ఆ వర్ణము లోని యాధునికులును పఠించుట గలదు. ప్రయోగాదికమును తీసివేయుడు. అష్టిశాస్త్ర మొకటి యున్నది. దానిలో ననేక విషయము లున్నవి. వానిని

కావ్యమున నవసరమైనచో కావ్యకథాసంబంధమైన యౌచిత్యముకొంతకు వాడవలయుట వలయుగదా !

' న తచ్ఛబ్దం న తద్వాక్యమ్
న సావిద్యా న సా కళా
జాయతే యన్న కావ్యాంగమ్
అహో భారో మహాన్ కవేః '

అని రసగంగాధర కర్త యన్నాడు. ఒక కవి యొక కథను తీసికొని యొక కావ్య మల్లును. తత్కావ్యరచనా మార్గమునందు కథానుగుణముగా నేదో యొక శాస్త్రము, ఏదో యొక కళ ప్రపంచింప వలసి వచ్చును. తత్ప్రపంచము లేకుండ కల్లబొల్లి మాటలతో గూర్చెడికవి శ్రద్ధలేనివాడు. గ్రంథమునకు తగినంత శక్తి నొసంగలేనివాడు. వ్యుత్పత్తి జ్ఞానము లేనివాడు. కవిత ప్రధానముగా ప్రతిభాధీనమైనను వ్యుత్పత్తి విహీనత కావ్యమున కధిక మర్యాద తేజాలదు. కవి ప్రతిభావంతు డనిపించుకొనును గాని కావ్య ముదాత్త మనిపించు కొనదు. ఆ లోప మీకావ్యమునందు లేదు.

ఈ గ్రంథములో ప్రధానమైన వస్తువు మంత్రశక్తికి నాత్మశక్తికి గల సంఘర్షణము. మంత్రశక్తి యధికమైనదా, ఆత్మశక్తి యధికమైనదా, అన్న ప్రశ్న. ఆత్మశక్తియనగా నిర్లిప్తుడై కామక్రోధాదులను జయించి బుద్ధునకు పరమశిష్యుడైన యానందుని వంటి వాని కున్న యాత్మశక్తి వంటిది కావలయును. కొందఱు దురాచారులు, కామక్రోధదూషితులు, దురహంకారులు అధునికులు తమయం దాత్మశక్తి కించిత్తైన లేకుండ మంత్రశక్తులను నిరాదరింతురు. ఈ కావ్యమునందలి సంబంధమునకు వారికిని సంబంధము లేదు. అట్టి యొక మాంత్రికురాలు, లేదా, యొక మాంత్రికుడు వీరిని తమకోపమున కగ్గము చేసిరా వీరు మ్రగ్గిపోదురు.

ఈ కావ్యవస్తువు సామాన్య పరిస్థితులలోనిది కాదు. మంత్రశక్తియు ఆత్మశక్తియు, రెండు నొకమహోత్కృష్టదశయం దున్నపుడు వాని

రెంటికి నడుమగల సంఘర్షణవలన ఆత్మశక్తియొక్క యాధిక్యము సూచింపబడుచున్నదిగాని, ఆత్మశక్తి లేనిచోట — అది వట్టి వాగ్వ్యాపారమైనచోట — ఆధిక్య మెట్లుండును? అది వృథావాచాలత యగును. మంత్రశక్తియే లేదనవచ్చును. లండను న్యాయార్కులు లేవని యొక గ్రామీణుడు వాదించినచో వినెడివారు వానికి తలతిక్క యనుకొని నవ్వుదురు. మంత్రశక్తులను కాదనుట యిట్టిది.

రవీంద్రుడు డీశక్తి యున్నదనియే కదా తానా నాటికను రచించెను; ఆగ్రంథములు నేటికి నున్నది. ఈ కవి తనకు లభించిన 'మాణిభద్రాది మంత్రజాలము' గల గ్రంథములనుండి వానిని చదివి సేకరించి యాగ్రంథము నందు నిక్షేపించెను. ఇది యీకవి వ్యుత్పత్తిలో భాగము. అచట విస్తరించి వ్రాయక రెండు మూడెవో పద్యములు వ్రాసి దాటిపోవుట వ్యుత్పత్తి దారిద్ర్య మనిపించుకొనును.

ఈ కావ్యమునం దింకొక విశేషము గలదు. ఈ కథ నేటిదికాదు, ఏనాటిదో! ఆనాటి సంఘ మెట్టిది? అప్పటి నాగరికత యెట్టిది? — అన్న విషయ మిందు ప్రస్ఫుట మగుచున్నది.

మంత్రములు ద్విధాభూతములు. ఒకటి వైదిక మంత్రజాలము; రెండవది శాబర మంత్రజాలము: ఈ శాబర మంత్రజాలమునకు లౌకిక శక్తి యెక్కువ. ఇంగ్లీషువారి పాలన రాకముందటి వఱకు మనదేశమున మంత్రముల ప్రసక్తి యెక్కువగా నుండెడిది. నేటికిని నిజాం రాష్ట్రము నందు మంత్రముల ప్రయోగించుట కలదు. 'బాణావతి' యన్న విద్య నేటికిని గలదు. హైదరాబాదునందు ప్రజాస్వామికము వెలకొన్న పూర్వ దినమువఱకు నిజాం ప్రభుత్వములో బాణావతీవిద్యను ప్రయోగించిన వారికి న్యాయస్థానములలో శిక్ష యుండెడిది. అయిదారేండ్లక్రింద సారంగాబాదులో నిట్టి యొక పరిస్థితి జరుగుటయు, రక్షణశాఖవారు నిష్క్రియు లగుటయు పత్రికలయందు ప్రకటింపబడెను.

మంత్రములు, తచ్ఛక్తులు, తచ్ఛిద్ధులు కలవని కొందఱైన నంగీక రింతురు.

అవును, కాదు; ఈ కథయందు తత్త్వశక్తి యున్నది. కవి దానిని గూర్చి తెలిసికొని, చదివి వ్రాయుట ముఖ్యము. తొలుత నీ కవిని నేనం దుకు ప్రశంసింతును.

మంత్రము మఱియు రెండు విధములు. అరిమంత్రము, సిద్ధిమంత్రము– దేనికి ఫలిత ముద్భవించదో అది యరిమంత్రము. ఫలితము కలుగునది సిద్ధి మంత్రము.

పూర్వము ఆదిశంకరుల జీవితములో నొక గాథ యున్నది. ఒక శాక్తేయుడు శ్రీశంకరులమీద నొక ప్రయోగము చేసెను. ఆదిశంకరు లకు భగంధరవ్యాధి యుదయించెను. ఇది కథ. ఆ సంప్రదాయ మున్నది. ఎంతటి లోకతంత్రమైనను యథార్థమైన యాత్మశక్తిముందు నిలువదు. మంత్రములశక్తి శరీరావధిక మైనది. ఇది శాబరమంత్రముల యొక్క విషయము.

ఈ కథ యీ మహార్థమును సూచించు చున్నది. యమ నియమ ధ్యాన ధారణాదులు మహోత్కృష్టములు. తుచ్ఛమంత్రముల బలము వాని నేమియు చేయజాలదు.

ఇంక నీ కవియొక్క రచనాశక్తినిగూర్చి విచారించినచో నీ కావ్యమునందు ప్రధానముగా బహుపద్యములయందు మాధుర్యగుణ మున్నది. ఈయన పద్యరచనయం దొక రీతియు గలదు. 'రీతిరాత్మా కావ్యస్య' అని వామనుడు నుడివెను. తరువాతివారు ధ్వన్యాదుల కగ్రతాంబూల మిచ్చిరి. అందుచేత కొన్నియాపదలును వచ్చినవి. పద్య రచనయందు సుష్ఠుత లేనిచో, నొకరీతి లేనిచో, మాధుర్యమో సౌకు మార్యమో ప్రసాదమో ప్రధానముగా లేనిచో – అది కవిత్వముగా విని పించదు. ఏదో గుణము ప్రధానముగా కలిగిన పద్యరచనయందు సిద్ధుడై

యుండుట కవికి మొట్టమొదట కావలసిన వస్తువు. పద్యరచనా సౌష్ఠవము లేని కవిత వేయిగుణములకు పుట్టినిల్లయినను మది కించదు.

ఈ కవియొక్క రచనయందు ఇది సిద్ధించియున్నది. సిద్ధించిన తరువాత కవితాగుణముల ప్రసక్తి.

ఈయన బౌద్ధకథను తీసికొని వ్రాయుచున్నారు. ఆ బౌద్ధమతము యొక్క సంప్రదాయము, తత్కథలో తల్లక్ష్యభూతములైన వాక్యములు, వారి వారి నామములు సమృద్ధిగా లేనిచో బౌద్ధమతముయొక్క లక్షణము భాసించక కావ్యగత మహార్థము చెదరి పోవును. అది గ్రహించియే ఈ కావ్యమున నీ కవి, బుద్ధుడు చేసిన బోధనలను కొన్నింటిని 'ధమ్మపదము' లోని వాక్యముల కనువాదములుగా వ్రాసెను. ఆనంద, కాశ్యపాదిశిష్యుల నామములు, నందరాహులాదుల ప్రసక్తియు తెచ్చి యొక యౌచిత్యము సంపాదించిరి. వర్ణనలో పలుచోట్ల సూచ్యార్థసూచకముగా వ్రాయబడినది. ప్రకృతియొక్క ప్రేమ దుష్పరిణామము పొందునని తొలుతటినుండియు సూచింపబడినది.

లేగదూడను పట్టుకొనుటకు పోయిన ప్రకృతి చండాలకన్యక యని తెలియకమున్న చెట్టునీడల విడిసిన పెద్దల కాముకతయు, పరిహాసకుశలతయు ఆమె చండాలకన్యక యని తెలిసిన తరువాత వారు దూషించుట చేత మానవ స్వభావములో నున్న దుర్లక్షణము వ్యాఖ్యానింపబడినది.

ఆమె యింటికి మరలిపోయినది. ఆ వెలివాడ వర్ణన మెంత రమణీయముగా నున్నది? ఎంత యుచితముగా నున్నది?

మ్రాగన్ను వడి వేపమ్రాని నీడను గూర్కు
బసవన్న శుద్ధ సత్త్వప్రవృత్తి
బురదలోపల దేహమును ముంచి పొరలాడు
మహిషరాజన్యు తామసగుణమ్ము

శృంగమ్ము లొడ్డి యుజ్జిఁదలంచి డీకొట్టు
        పొట్టేలి రాజసాభ్యుదయ గరిమ
'లేవనే లేవఁడు, లేచెనా ......' యనఁజూచు
        పెనుమేఁకపోతు గాంభీర్యమహిమ
ఒక్కచోఁజేరి బ్రదుకులో నొదిగియున్న
వివిధజీవుల చిత్తప్రవృత్తులెల్ల
లీలగాఁదెల్పు నొక్కచందాలవాటి
పోలుచు నల్లదె, శ్రావస్తిపురము నంటి!

ఒక మట్టిపీడ నిద్రకుఁజొచ్చి గూడెపుఁ
        బెద్ద పెద్దగ గుఱ్ఱువెట్టఁ దొడఁగె;
కల్లు పెల్లాని యొక్కఁడు మండుటిసుకలో
        నట్టిటు తూఁగి దోఁగాడఁ దొడఁగె;
తొడగొట్టి కవ్వించి మడమ త్రిప్పకపోరె
        మల్లుఁ డొక్కఁడు తోడి మల్లుతోడ;
'వదలి పెట్టుఁడు నన్ను వైరిగుండెలు ప్రీల్తు'
        నని యొక్కభీరు వట్టాడఁ దొడఁగె;
భిన్నగుణముల ప్రోవుగా నున్నయట్టి
బుద్ధి నొదవెడు రుచిభేదములను బట్టి
కలకలముసేయు జనముల కలిమి బలిమి
నెసఁగు వెలివాడ సందడి కేమి కొఱత!

చాలమంది కవులు వర్ణన యనిన తోడనే యూహానల్లి చేయుదురు. సహజముగా కవియైనవాడు తాను చూచి పరిశీలించిన విషయముల నిట్లు వర్ణించును.

ఒకడు పూర్వకావ్యములను పఠించుటచేత తనకు వచ్చిన కవితను దానిని దానినిగానే భాసింప జేయును. ఒకడు బహువిధములైన నూత్నాను

భవమ్ములను తనకావ్యమునందు సంతరించును. ఈ రెండవవాడు తొలి వానికన్న నధికుడు. ఆ లక్షణము కొంత యీ కవిలో నున్నది.

ఈయన జాగ్రత్తగా పూర్వకావ్యములను చదివినవాడు. 'పంబిన', 'ఇల్లిగ్గులు' మొదలైన శబ్దములు దానికి సాక్ష్యములు.

రెండవది యీయన స్వతంత్రుడు. వర్ణనలన్నియు స్వకపోల కల్పితములే కాని సిద్ధమాధుర్యములని పూర్వకవుల యెంగిలిమాటలతో వర్ణించడు.

కాని పూర్వకవుల కొన్ని మధురములైన పద్యైకదేశములయందలి మాటలను తీసికొనుట దోషముకాదు. కాదు సరికదా గుణమగును. ఈ కావ్యమునందు పెద్దన్నగారి కొన్నికొన్ని మాటలు కనిపించును. వానిని భావుకులే తిలకింతురుగాక!

వీరి కొన్ని యుత్పలమాలలు పరమరమణీయముగా నున్నవి. అనుస్వార పూర్వక చకార ముత్పలమాలయందు ప్రాసగా స్వీకరించినచో — ద్విత్వలకారము ప్రాసగా స్వీకరించినచో — ఉత్పలమాలయొక్క సొగసు వచ్చును. రెండుచోట్ల వీ రాసొగసును సాధించికొనిరి.

ఉ:- అంచ రుతించినట్టులు, పికావళి సుస్వర మూదినట్లు, క
వ్వించి కలాపి షడ్జమము వించిన యట్టులు, వేణుగాన మొ
ల్కించిన యట్లు, వీణ పలికించిన యట్టులు, వేదవల్లి వ
ల్లించిన యట్లు శ్రావ్యమగు లీల నొకానొక నాద మొల్కఁగన్

మొత్తముమీద నీ కావ్యము మధురముగా నున్నది. ఉదాత్తముగా నున్నది.

విజయవాడ
28-5-63

(సం) విశ్వనాథ సత్యనారాయణ

# సందర్శనం

## *డాక్టరు జి. వి కృష్ణారావుగారు*

నరసింహారావుగారూ,

మీ ఆనందభిక్షువును సందర్శించాను. ప్రసన్న గంభీరమైన ఇతివృత్తం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ముఖ్యంగా ప్రకృతి. ఆమె నెచ్చెలియైన తర్ణకం. ఆమె జనని ఇప్పటికీ నా మనస్సులో మెదలుతున్నారు.

కథానాయిక అయిన ప్రకృతి సాంఖ్యుల ప్రకృతికాదు; అద్వైతుల మాయ అంతకంటె కాదు. ఆమె ప్రవర్తనం తర్ణకప్రవర్తనం వలె పాపపుణ్య ప్రమాణాలకు అందదు. ఆమెలో శుచి, సురూపం, అమాయికత్వం గూడు కట్టుకొన్నవి. జాతిని మున్నిడుకొని ధూర్తలోకం తన్ను అవమానించినప్పుడు ఆమె నొచ్చుకొని నమస్కరించి వైదొలగి నదేకాని ప్రతిఘటించినదికాదు. లోలోనవైన ద్వేషించలేదు. జాతి నింద్యం కాదని ప్రబోధించి ఆనందుడు తన్ను గౌరవించినప్పుడో ! ఆమె విస్మిత అయింది. పొంగిపోయింది. ఆనందుని మనసార ప్రేమించింది. అతడు తనవాడు కావాలని కోరుకొన్నది. కాని అందలి స్వార్థం ఆమెకు ఎరుకపడలేదు. ఆ అమాయికత్వం అలాంటిది.

ప్రకృతి తల్లికి లోకం తెలుసు. మంత్రాలు వచ్చు. అయినా ఆమె అహంకరించలేదు. నీతికి చేతులు జోడించింది. పుత్రికపై ప్రాణాలు పెట్టుకొని బ్రతుకుతున్నది. ఆ ముదుసలితల్లిని ప్రకృతిప్రణయం చకితను చేసింది. లోకసమ్మతమార్గాన దానిని మలచయత్నించింది. అది సాధ్యపడలేదు. వాత్సల్యప్రేరితయై ఆభిచారికప్రయోగం చేసి ఆమె

ఆనందుని ఆకర్షించి అసువులను కోలుపోయింది. ఆమె దారుణమృతికి వగవటానికి తర్ణకం, పాతకుడు మాత్రమే మిగిలారు.

కడుపున పుట్టిన ప్రకృతికూడ నివాపాంజలి కాదుగదా! ఒక్క అశ్రుకణమైనా తల్లి కొఱకు విడువలేకపోయింది. కారణం? ఆమె హృదయం అసురమా, పాషాణమా? కాదు, ముమ్మాటికీ కాదు. ప్రయోగాకృష్టుడైన ఆనందుని వదనంలోని భయంకర వైకృతం తొలిసారిగా ఆమెకు స్వార్థమందలి కాలుష్యాన్ని విచ్చిచూపింది. ఆ అనుభూతితో ఆమె అనురాగం విగలితస్వార్థమై, స్వచ్ఛమై మహాకరుణగా పర్యవసించింది.

ఆ మహాకరుణ ఉపాదేయమే. ప్రకృతి పొందినసిద్ధి అభినంద్యమే. కాని నావరకు నేను ఆతర్ణకాన్ని మెచ్చుకొంటాను. దాని వలెనే అనిష్టదుష్టులకై కన్నీరు విడువగోరుతాను. ఇదంతా సంసార వ్యామోహ మని మీ రనవచ్చును. అవునేమో! వాదం దేనికి?

అయినా ఒకవిషయంలో మీతో ఏకీభవించలేకపోతున్నాను. మీకావ్యాన్ని ఆనందభిక్షు వన్నారు. ఈ నామకరణాన్ని మీరు సవాలక్ష కారణాలతో సమర్థించవచ్చును. అయినా దేవతలకంటె దేవత్వప్రాప్తి కోసం తపస్సుచేసే జీవి ధన్యం కాదా?

ఏది ఎలా ఉన్నా జాతి, మత, వర్ణాది స్వార్థరహితమైన స్వచ్ఛప్రేమ - మహాకరుణ - నేడేకాదు, ఏనాడూ ఆవశ్యకమే. దీనిని హృదయంగమంగా చిత్రించిన మీ వాక్కు చెప్పుకోదగ్గది.

విజయవాడ
25—6—63

(సం.) జి. వి. కృష్ణారావు

# స మా హా ర ము

## శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు

'ఆనందభిక్షువు' మధుమాస నిదాఘ ప్రావృట్కాల సమాహారము. సౌగత వైదికదర్శన సమన్వయము. ఐహికాముష్మిక జీవితసమ్మేళనము. శృంగార శాంతముల కూడలి.

చండకిరణమాలాపరితప్త యగు ప్రకృతి ఇందలి నాయిక. ఆమె ఆనందభిక్షువు. ఆమెకు ప్రాప్యుడు ఆనందుడు. అతడే నాయకు డగు ఆనందభిక్షువు. వారి సంయోగమే ఇందలి పరమార్థము. ఆనందభిక్షువులు నాయికా నాయకులుగా కల కావ్యము 'ఆనందభిక్షువు'.

ప్రకృతి తల్లినే ఎఱుగును. తండ్రి యెట్టివాడో ఎఱుగదు. గోవత్స మామెకు సయిదోడు. ఆమె ఆనందసంయోగ మాకాంక్షించినది. ప్రకృత్యానంద సమాగమరూప మగు దివ్యశృంగారమయమైన ఈ కావ్యము రమ్యమగు శృంగారము నాధారముగ చేసికొని సహృదయుల హృదయములలో శాంతమును అభివ్యక్తము చేయజాలు విచిత్రశక్తి కలది.

ఇది బౌద్ధకావ్యమే. కాని కవి సంప్రదాయసిద్ధు డగుటచే తత్త్వ శాస్త్రముగా, వేదాంతకావ్యముగా పరిణమించినది. నిగూఢమగు తత్త్వము ధ్వనిమార్గమున సహృదయ మనోభివ్యంజితమై భాసిల్లును. ప్రకృతి జననినే యెఱుగునట! జనకు నెఱుగదట! ఆ జనని యెవరు? ఆమెయే అవిద్య. కర్మప్రవాహరూప కామ్యాభిచారిక కర్మపరతంత్ర. ఆ తల్లి గర్భమునుండి జననమందిన జీవశక్తియే ప్రకృతి. ఈ ప్రకృతికి తల్లి

బ్రతికియున్నంతకాలము ఆనందుని పొందు భాగ్యము లేదు. ఆ యానం దుడే పరమానందము.

ఆతని దివ్యగీతికా శ్రవణాంకురిత మగు ఆమె యనురాగ బీజము అంజలి పరిదత్తమనోంబుధారాపరిశమిత పిపాసువగు వయ్యానందుని దర్శనముచే పల్లవితమై, మనన నిధి ధ్యాసనలచే పుష్పితమయ్యు మాతృ సాహచర్య మున్నంతకాలము ఫలింపలేదు. అవిద్యా పరికల్పిత మోహా విష్ట జనోపాస్యములగు అభిచారిక కామ్యకర్మలు ఆనందస్వరూప సాక్షా త్కారమునకు సాధనములు కానేరవు. అవిద్యా వినాశనసమయమే ఆనంద సమాగమ సమయము.

ప్రావృ డంభోదమాలాపరిష్వంగము ఘర్మ పరితప్తమానస యగు చండాలికి లభింపవలెనన్న గోవత్స సాహచర్యము ఆవశ్యకము. శ్రుతి చోదిత ధర్మమే ఈ గోవత్సము. శ్రుతియే గోవు. తత్పరిచర్యా ప్రభూత నిష్కామోపాసనా పరిశుద్ధ మనస్కతయే చండాలికి ఆనంద సంయోగాధి కారదాయకము.

తాపత్రయాభీల సంసారమే నిదాఘము. అదియే జీవితమునను ఈకావ్యమునను గూడ అధికముగ కాన్పించును. మధువర్షాసమయములు అద్యంతముల అచిరాంశు విలాసముల విలసిల్లును.

ఇట్లు ఐహికాముష్మిక జీవితములను బింబ ప్రతిబింబ భావమున భాసింపజేయు ఈ దివ్య శృంగారమయ కావ్యము సహృదయుల మన్నన లను తప్పక అందగలదు.

ఇందొక విచిత్రమైన విషయమును గుర్తింపవలెను. నాయికకు (ప్రకృతికి) నాయకుడు (ఆనందుడు) జనకుడో, ప్రియుడో, సోదరుడో,

ఆచార్యుడో, త్రాతయో యెఱుగ శక్యముకాదు. వారిద్దఱిలోగల భావము వాత్సల్యమో, ప్రేమయో, సౌభ్రాత్రమో, భక్తియో, కరుణయో తెలియదు. వారిద్దఱును ఒకేతత్త్వము యొక్క భిన్నాంశము లేమో!

ఈ విశ్వప్రణయ తత్త్వమునే సౌగత శ్రుతిగా కవి కథాంతమున ఇట్లు వినిపించినాడు.

"విహరింపుడీ మీరు విశ్వభిక్షువాటి
నకుటిల ప్రణయ భిక్షకులు గాగ
పూరింపుడీ మీరు భువన భిక్షాపాత్ర
ప్రేమాన్నదాన సంప్రీతి గాగ
చరియింపుడీ మీరు జగతీకుటుంబాన
పరిణత ప్రణయ సోదరులు గాగ
సాగింపుడీ మీరు శాంత సౌగత యాత్ర
పుడమి బౌద్ధారామ భూమి గాగ
ప్రకృతి నొదవెడు రాగ విరాగములకు
వికృతి నొందని యానంద విమల మతికి
శరణమగు బౌద్ధధర్మంబె, శరణ మగును
ప్రణయపరితప్త నీరస ప్రకృతికైన."

"నిజమే! ఈ విశ్వభిక్షువాటిలో మానవులందఱు చండాంశు మయూఖమాలాభూతులు; ఆనందభిక్షువులు; ఘర్మపరితప్తులు. ఆనంద ప్రాప్తియే వారికి పరమగమ్యము. దానికి ధర్మసేవ, అవిద్యా త్యాగము ఆవశ్యకములు."

ఈ మహార్థమును వ్యంగ్యభంగిలో ప్రబోధించు ఈ కావ్యము ఉదాత్తమై, రమణీయమై, సహృదయమనఃపీఠముల శాశ్వతముగ నలంకరింప జాలునదై యున్నదనుటలో అతిశయోక్తిలేదు.

ఇట్టి మహత్తర తత్త్వకావ్యమును రచించిన శ్రీ నరసింహారావుగారు ప్రతిభా వ్యుత్పత్తులతో నలరారుచు ఉదాత్త రమణీయములగు కావ్యములను ఇంకను రచించు సమర్థులగునట్లు ఆపరమ శివమూర్తి ప్రసాదించుగాక!

రాజమహేంద్రవరము
19—7—1963

(సం.) శ్రీభాష్యం అప్పలాచార్యులు
సంస్కృత శాఖాధ్యక్షులు
రాజమహేంద్రవర ప్రభుత్వకళాశాల.

# కృతజ్ఞత

త్యాగశీలమైన విశ్వప్రేమకు బుద్ధదేవుని పవిత్రనామం పర్యాయ పదం. అజ్ఞానపు టంధకారంలో అలమటించే ఆర్తలోకానికి ఆ ప్రభువు ఆదేశం ఆరని వెలుగు. ఆ వెలుగును అన్నిదిక్కులకూ అందజేసిన సుగతశిష్యులలో ఆనందభిక్షువు అతి ముఖ్యుడు. సర్వమానవ సమానత్వ సౌభ్రాత్రాలను సాధిస్తూ, పతితజనోద్ధరణాన్ని ప్రబోధించిన ఆ భిక్షూత్తం సుని పవిత్రజీవితం బుద్ధునిజీవితం వలెనే నా హృదయాన్ని చిరకాలంగా భక్తిపరవశం చేసింది.

దానిని పసిపట్టిన మిత్రులు శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు ఒకనాడు నా కొక గ్రంథాన్ని అందించారు. అందులో చండాలిక అనే నాటిక కనిపించింది. అది విశ్వకవి రవీంద్రులు రచించినది. దానికి మూలం ప్రసిద్ధమైన ఒకానొక బౌద్ధగాథ. 'చండాలిక'ను శ్రద్ధగా చదివాను. నా మనస్సులో మెఱపు మెఱసి నట్లయింది. సాహితీ జగత్తులో సుప్రతిష్ఠితములైన సౌందరనందం, బుద్ధచరిత్రం, కరుణశ్రీ మొదలైన కావ్యాలు స్మృతిపథంలో కదిలినై. నాలో అమూర్తములై యున్న భావాలకు మూర్తికల్పనం జరిగింది....కొన్నాళ్ళకు ఈ 'ఆనందభిక్షువు' అవతరించింది.

ఈ కావ్యానికి విశ్వకవి నాటికలోని వస్తువు సూత్రప్రాయం. కథ శ్రవ్యకావ్యానుకూలంగా ప్రపంచింపబడింది. ప్రకృతి - ఆనందుడు - ప్రకృతిమాత - గోవత్సం మొదలైన జీవులు ఆలంబంగా మఱికొంత

దూరం తత్త్వాన్వేషణం చేశాను. ఆ యా విశేషాలను 'సమాహార' రూపంగా పెద్దలు స్పష్టం చేశారు.

'ఆదేశ'మనే ఘట్టంలో బుద్ధదేవుడు శిష్యులకు చేసిన బోధలు కొన్ని నిక్షేపించబడినాయి. లోకసంతారకములైన ఆ ప్రభువు బోధలు సొంత కవిత్వంలో ఒలికించటం క్షేమం కాదనిపించింది. అందువల్లనే 'ధమ్మపదం'లోని బుద్ధబోధలకు కొన్నిటికి భావానువాదం చేశాను.

ఈ కావ్యాన్ని ఉత్తమ కవిమిత్రులైన పలువురు రసజ్ఞులకు వినిపించాను. వారు నన్ను ముద్రణకై ప్రోత్సహించారు. పూజ్యమిత్రులు శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులుగారి ప్రోత్సాహం చిరస్మరణీయం.

ఆంధ్రసాహితీ జగన్నాథులు, కవి సమ్రాట్టులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సాదరంగా, సావధానంగా, మూర్ధాశ్లీ కావ్యాన్ని విని, సంతోషించి, సువిస్తృతమైన 'కావ్యతత్త్వప్రకాశిక' ప్రసాదించారు. విమర్శక కవి పండితులు, డాక్టరు జి. వి. కృష్ణారావుగారు ప్రత్యక్షర పరిశీలనం చేసి ఆనందభిక్షువును సముచితంగా సందర్శించారు. సంస్కృతాంధ్ర పండితులు, సహృదయ శిఖామణులు శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులుగారు నిశితమైన తత్త్వదృష్టితో కావ్యగత రసధ్వని విశేషాలను ఆవిష్కరించారు. రసదృష్టితో, భాషాదృష్టితో ఈ ముప్పురు మనీషులు చేసిన కొన్ని సూచనలను శ్రద్ధతో స్వీకరించాను. వారి సౌహార్ద సౌమనస్యాలకు కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

అనుపమ ముద్రణాలయము వారు అనుపమంగా ముద్రించి గ్రంథానికి అందముగా రూపురేఖలు దిద్దారు. వారితో పరిచయ గౌరవం కలిగించిన అజంతా ముద్రాపకుల మేలు మఱువరానిది.

నా కావ్యాన్ని వెలుగులోనికి తేవడానికి నిరంతరం తపించిన నా బహిఃప్రాణం మిత్రశ్రీ మల్లికార్జునరావు ఋణం నాలుగైదు అంకితపు పద్యాలతో తీరుతుందా ?

చిన్నతనం నుండి నన్ను సాకి, నా బ్రతుకునకు సాహితీవాసన సోకించిన పితృతుల్యులు, మా బావగారు, బ్రహ్మశ్రీ గోవిందాచార్య కవివరేణ్యుల పాదాలను - ఈ శుభసమయంలో - ఆనందాశ్రువులతో కడిగి నా 'ఆనందభిక్షువు'ను సహృదయహృదయ సన్నిధిలో సవినయంగా నిలుపుతున్నాను.

రాజమహేంద్రవరము
22—7—1963

వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు

# ఆనందభిక్షువు

ఆవేదన

ఆనందము

ఆకాంక్ష

అనుతాపము

అనునయము

ఆకర్షణము

ఆదేశము

# ఆవేదన

బుద్ధదేవుని మూర్తి విస్ఫూర్తి దోఁప
నలరు కరుణాలయుండు హిమాలయుండు
తరణి కిరణ ప్రతాప సంతప్తుఁడయ్యుఁ
జల్ల చల్లని చాయల జగముఁగాచు.

శాక్యమునిచంద్రు నున్నతాశయము వోలె
మిన్ను లొరసెడు నా హిమవన్నగేశు
పాదసీమకు దక్షిణప్రాంతమందు
మురువు చిందెడు శ్రావస్తిపురము గలదు.

బుద్ధదేవుని శ్రీపదాంబుజ రజంబు
ప్రత్యణువునందుఁ బ్రణయసౌరభము విరిసి
పుడమిఁ బ్రాకుచు శ్రావస్తి పురము సొచ్చి
మధుర మధుమాసమున ధర్మ మధువు కురిసె.

ఆ మధూదయ వేళలో – నంత దనుక
మూఁగవోయిన ప్రకృతి సంబుద్ధమగుచుఁ
బంచమస్వరమేళన స్వాదువయిన
నూతనానంద మధురసంగీత మొలికె.

అరుణరాగమ్ము నాశాంతముల్ నింపెడు
తరణి కూటమికి మై మురిసి మురిసి
మధురగానమున సౌమనసరాగము పెంచు
భ్రమరసంగతికి లోవగచి వగచి
జిలిబిలి కమ్మతావులు చిల్కు దక్షిణా
నిలుని మైత్రికి మది నులికి యులికి
వర్ణభేదములేక ప్రకృతిఁ బుల్కలఁ దేర్చు
పురుష నౌదాసీన్యమునకుఁ బొగిలి

ప్రియకరాస్పృష్టమైన జీవితపుటార్తి
నయిపఁజాలక ప్రణయ రజః కషాయ
గళిత మధువొచుఁ జైత్రరాగములు పెదర
జలజముఖమునఁ బ్రకృతి క్రొవ్వలపు నెఱపె.

జలజబంధుండు ప్రకృతి చాంచల్య మరసి
చండ వైశాఖ భానుఁడై మండిపడియెఁ,
పుడమి బీటలువాఱె, లేమొలక లెండి
వాడి వరుగయ్యె - నపుడు శ్రావస్తిపురిని -

పచ్చిక బీళు లెండెఁ; బలుపక్షితతుల్ దగ దొట్టి నీళ్ళకై
పిచ్చిగ చూడసాగెఁ; బసిపెయ్యలు కయ్యలఁ బల్వలాంబువుల్
మెచ్చక నిక్కి గ్రుక్కిళులు మ్రింగెను; గుత్తుక యెండి గూటిలోఁ
జచ్చిన కూనకై కుములసాగెను కాకము కొమ్మమాటునన్.

ఉన్నట్టు లుండి తపనుఁడు
కన్నుల నిప్పుకలు రాల్చి ఖరకర తప్తా
పన్న ప్రాణికులుండయి
మన్నను మి న్నొకటి గాఁగ మంటలు రేపెన్.

పంబిన భానుతాపమునఁ బ్రాణభయాకులమైన జంతుజా
లంబును గాంచి చిత్తము కలంగఁగ, గుండెలు వ్రీల, దుఃఖ బా
ష్పాంబువు లాపగా జలములై ప్రవహింపఁగఁ బర్వతేశ్వరుం
డంబరచుంబిదేహ మది యానఖశీర్షము కంపమొందఁగన్.

మూర్తి దాల్చిన కారుణ్యమో యనంగ
ప్రాణిలోకమ్ము నుద్ధరింపంగఁబూని
తుహినజలములు వివిధాకృతులుగ మలఁచి
చంద్రరవి క్రద్దముగ ధరాస్థలికిఁ దోలె.

ఒడలు గాలిన కీట కౌఘమ్ముపై నిద్ద
యివపుసెల్లా లిట్టె యెండిపోయి
గొంతెండి పడిన పుల్గులపైనఁ గురిసిన
హిమశీకరము లిట్టె యిగిరిపోయి
వడదాఁకి సుడివడ్డ బుడుతలపై నిద్ద
శీతలానిల మిట్టె చెదరిపోయి
వఱువట్లుగొని పడ్డ పసులకై తొలఁచిన
హిమకుల్య లిట్టె శుష్కించిపోయి

చండరశ్మిధాటికి గుండె జలదరించి
యా హిమాలయుఁ డసురుసురగుచుఁ దోఁచె
వేదనాతప్త లోకమ్ము సేదతీర్ప
సంతతము తపించెడి బోధిసత్త్వు పగిది.

సకలజంతుకోటి సంతప్తగాత్రమై
యుస్సురుస్సురనుచు నుదరిపడెడు
నట్టి కుతపవేళ 'నంబే' యటం చొక్క
లేఁగదూడ గొంతు లీల మొరసె.

రాచబాట చెంత - రచ్చబండల పొంత -
బావి గలదు గంగరావి క్రేవఁ;
బగలు ప్రొద్దువోని పనిలేని జనులెల్ల
వత్తు రటకు "పిచ్చ–పాటి" యాడ.

అల్ల నల్ల దుమికి యాడుచు నా లేఁగ
యావుదూడ వచ్చి యచట నిలిచి
చెట్టు నీడ మేను సేర్చిన జనులెల్లఁ
గలవరింప నొక్క గంతువైచె.

మువ్వల మ్రోఁతతోడ జగమున్ మురిపించుచు చౌకళించి, బల్
రివ్వన డాసిడాసి యదలించిన పోవక నిల్చి, యంతలో
దవ్వున కేగి యేగి కనుదమ్ముల నల్లన నప్పళించుచున్
జివ్వున వచ్చి బావికడ నిల్చె చివాలున వాల మార్చుచున్.

కూర్మి లేఁగనంటి కోమలి యొక్కర్తు
పదియు నెనిమిదేండ్ల పడుచు, చేతఁ
జిన్నికోల వట్టి చిందు ద్రొక్కుచు వచ్చి
వాలె నొక్క కొండవాఁగు వోలె.

ఆ నడసొంపు, లా జిలుఁగుటందెల సవ్వడు, లా త్రిభంగిమై
మై నమరించుటల్, కనుబొమల్ సవరించుట, లా కరాబ్జమం
దూనిన కోలత్రిప్పి "యొహొహో"యని లేఁగ నదల్చు నేర్పు; లా
తేనియలొల్కు లేఁబలుకుఁ దీరులు తత్ప్రజఁ జొక్కఁ జేసెడున్.

చరచర మండు నెండలకుఁ జల్లని నవ్వుల పూలపందిరుల్
పఱచి, ప్రసన్నవాగమృత వాహినులన్ దగదీర్చి, చిత్ర సుం
దరతరశార్ద్రి దృగ్విలసనమ్ముల మైపులకల్ రచించి, శై
శిర సుఖముల్ ఘటించి మనిచెం దరుణీమణి మానవావళిన్.

చనవు మెయిఁ దను గనుంగొను
జనమున కొకయింత దవ్వుచని దూడమెడం
దన సందిట నిడి ముద్దిడు
కొని మెయి పుణుకుచు సుమాంగి కొంపోవునెడన్.

మెడపట్టు దుసికిలించుచుఁ
బడలాగుచు లేఁగదూడ పరుగునఁ బోవం
దడబడి ముగ్గతిలంబడి
ముడియూడిన కురులు ముగుద ముడుచుచు లేచెన్.

"అణఁగెవో యమ్మాయి యార్భాట"మని యొక్క
తలపండినట్టి తాతయ్య గొణఁగె;
"ఏది యింకొకసారి యెగిరిచూపు" మటంచుఁ
జపలుఁ డొక్కఁడు క్రొత్త చనవు నెఱపె;
"ఇంత చల్లనివేళ నెంత చక్కని నాట్య"
మని యొక్కసరసుండు హాస్యమాడె;
"అనుభవింపక తీర"దని యొక్క భార్యా వి
యోగార్తుఁడగు బాలయోగి బనవె;

"తోడితెచ్చెద విదె లేఁగదూడ నతివ!
వెంటఁగొని వత్తునా" యనెఁ గంటి కొనల
జాలి నటియించు నొక్క దౌర్జన్యమూర్తి
తక్కఁగలవారు హాస్యతత్పరతఁ జూడ.

మొగలి లోరేకవోని యమ్మగువ మొగము
వంచి, యాత్రికై మెల్లఁగాఁ బలికె నిటులు
“చాల దయగల దొరలు దండాలు బాబు,
మంచి మేలొనరించి మన్నించినారు.”

“ఇంతకీ విప్పు డెచ్చటి కేగవలయుఁ
జెప్పుమా?” యంచు నొకఁడు ప్రశ్నింప, నామె
“పురము వెలివాడ బా, బిదె పోవుదాన,
ననుఁగు లేఁగ యెందేగెనో” యనుచుఁ బలికె.

ఆ పలుకుల్ చెవింబడిన యంతన “యేకుల? మేది జాతి? నీ
కాపుర మేద? నెవ్వతెవు? కన్నులు కానవా? రాజ వీథిలో
నీ పలుగాకి పోకిళుల నెవ్వరు చూచి సహింతు? రింతకుం
బాపము పండె; నిన్ననినఁ బాపములే!” యని రందు కొందఱున్.

బడబడ నోటికి వచ్చిన
వెడపలుకులు పలికి బిట్టు బెదరింపంగం
దడబడక నిలిచి కోమలి
కడు నడఁకువ మెల్లమెల్లఁగా నిటు లనియెన్.

"పేరు ప్రకృతి - నగరి వెలివాడలో నునికి -
తండ్రి వోయెఁ జిన్నతనమునందె -
కనుల వత్తి వెట్టికొని సాఁకు మాయమ్మ
బాబులార, పేదబ్రదుకు మాది."

అడుచుఁ బాడుచున్ జనుల కందఱ కద్భుత మావహిల్ల మేల్
వేడుక కూర్చు మానవతి వెచ్చని బాష్పము లొల్కఁ జల్లఁగా
నాడు నమాయికోక్తులకె యాత్మ రగుల్కొని కోపవహ్ని రా
పాడఁగ నిప్పుకల్ కురిసి రచ్చటఁ జేరిన పెద్ద లందఱున్.

"కనులు నెత్తికి వచ్చెఁ గడజాతి నాతికి,
నౌరౌర !" యని తాత యొకడు గఱచె;
"మడి మైల మర్యాద మట్టులే లే"వని
చపలుండుఁ దడవె నాచార సరణి;
"శ్రావస్తి నగరి ముచ్చట తీర్పవచ్చిన
జాణలే"యని పల్కె సరసుఁ డులికి;
"మారెఁబో కాలమ్ము, మహివర్ణభేదమ్ము
లుండరా"దని బాలయోగి మ్రోగె;

"ఇట్టి టక్కరి యోగులే యేగుదెంచి
మతము ధర్మముఁ గులమును మంటఁగలిపి,
రుడుగు డిఁకమాట, లిద్దాని వెడల నడవఁ
దడయుఁ" డని కట్టుపెత్తనదారి కసరె.

మాటలె యీటెలై పొడువ మానిని శోకముమ్రింగి "యీ శ్రమం
బేటికి బాబు లిందఱకు ? నేగుచునుంటిని, లేఁగదూడ కొం
డాటక మాడెఁగాని యెపుడైనను మావెలివాడ వీడి యి
చ్చోటికి వచ్చియుంటిమొకొ ? సుంత క్షమింపుడు దోసమైనచోన్.

పెద్దలు మీర లిందఱొకపెట్టునఁ బైకొని దిక్కులేని నన్
రద్దియొనర్పనేల ? యిఁకరా నని యొట్టిడుకొందు మిమ్ముఁబోల్
పెద్దలు సంచరించు పురవీథుల కెన్నఁడు, బాబులార ! యీ
ప్రొద్దు ననున్ క్షమింపుఁ"డని ముద్దియ యొద్దికమీఱఁ బల్కెనన్.

కొంద ఱుదార మనస్కుల
కందలి దైన్యంబె హృదయ మార్ద్రమొనర్పన్
గొందఱు సనాతనార్యుల
కందలి వ్యంగ్యంబె విషమమై కసిరేపెన్.

"ఎదురం బ్రతిన్నలు వంకదండము లిసీ, యేమంత చోద్యమ్ముగన్
సొదలాలింతురు ? గోళ్లగిల్లుకొనుచుం గూర్చున్నచో కొంప కూ
లదె ? కీడెంచియ మేలు నెంచవలె; ధర్మభ్రంశమేయైన మీ
బ్రదుకుల్ బండలుగావె?" యంచు నొకఁ డార్భాటించె నుగ్రమ్ముగన్.

"ఇపు డే ధర్మము భ్రంశమైనయది స్వామీ, సర్వభూతమ్ము లం
దుపకృత్రప్రత్యయబుద్ధి పోనడచు టార్యుల్ మెత్తురే? జాతి మా
త్రపు భేదమ్మున నుచ్చనీచతలు నిర్ధారింతురే ? బుద్ధ బో
ధ పవిత్రామృత మానరే? " యనుచు నుద్ఘాటించె వేఱొక్కఁడున్.

"ఎచ్చటినుండి యూడిపడె నీ మిడిమేలపు బౌద్ధధర్మ ? మీ
పిచ్చి కుదుర్పకున్న నడివీథికి లాగి "అభాసు" చేయరే
యచ్చపు టార్య ధర్మములు, హైందవ పద్ధతు, లాగమోక్తులున్,
హెచ్చరికన్ జరింపుఁ డిఁక నేని జన"మ్మని యొక్కఁడార్వఁగన్.

మాటకు మాటసాగి యతిమాత్రపు వాదము రేఁగ గాటపున్
బోటరిబంటులై పెనఁగు పోలిక బొబ్బలువెట్టు తత్ప్రజా
కోటికి దూరమై నిలిచి కోమలి కుంచితగాత్రవల్లియై
పైఁట చెరంగుతోడఁ దుడువం దొడఁగెం దెలిబాష్పబిందువుల్.

కన్నె దీనదశను గనెనేమొ దినరాజు
వాదులాడు జనులఁ బాఱఁదోలఁ
జండ దృష్టి పఱపి జ్వాలలు రేఁపెఁ, ద
త్ప్రజలు బడలి తాపవహ్నిఁదూల.

"ఎంగిలి మంగలం బయిన దిప్పటికే" యనుకొంచుఁ గొంద, "ఱీ
యంగన కా తథాగతుఁడె యాదరువౌ" ననుకొంచుఁ గొందఱున్
గ్రుంగి కృశించు కన్నెపయిఁ గోప కృపా పటువహ్నివార్నిధుల్
పొంగులు వార్చి, యొక్కొకరు వోయిరి యచ్చొటు వాసి తప్తులై.

# ఆనందము

ఇనరశ్మిన్ దనుతాప మించుకయె లే కెందుండి యేతెంచెనో
మునిగాళుల్ మహిమోపి క్రేళ్ళుఱుకుచుఁ మోమెత్తి గోవత్స మం
గన కెంగేలు స్పృశించి పైచెఱఁగు లాగన్ జొచ్చెః నమ్ముద్దు లేఁ
గను గన్గొం చొక కొంత తెల్విగనె ముగ్ధస్వాంత సుస్నిగ్ధయై.

చెంగటన్ జెంగనాల్ ద్రొక్కి చిన్నివాల
మల్లనాడించు లేఁగ మేనెల్లఁ బుణికి
పరవశత చెందు గోమాత పగిది, లేఁగఁ
బొదివి చెలి యొక్క లలితానుభూతి నందె.

ముద్దు కనుగల్వ లలనల్ల మూసి లేఁగ,
మోము మోమునఁజేర్చి యమ్ముద్దరాలి
యాత్మవేదన చల్లార నాదరార్ద్రి
సురుచిర స్నిగ్ధమగు నొక్క చూపు చూచె.

ప్రకృతి నెమ్మేనఁ బులకాంకురములు వొలిచి
యెడఁద గుడిలోనఁ జిఱుగంట లిట్టె మొరసె;
దివ్యపరిమళ మొకఁడు వీతెంచె; నంత
శిశిర శిశిరార్ద్ర గానవీచికలు విరిసె.

అంచ రుతించినట్టులు, పికావళి సుస్వర మూదినట్లు, క
వ్వించి కలాపి షడ్జ[illegible]ము వించిన యట్టులు, వేణుగాన మొ
ల్కించిన యట్లు, వీణ పలికించిన యట్టులు, వేదవల్లి వ
ల్లించిన యట్లు శ్రావ్యమగులీల నొకానొక నాద మొల్కినన్.

ప్రకృతి మనోహరప్రణయభావ పరీమళ ముల్లసిల్ల నా
త్మకుఁ బరమ ప్రమోదకరమౌ కలనాద మదెచ్చటో యెఱుం
గక మునిగాళ్ళపై నిలిచి కన్గొనసాగె; సుదూరమందు భి
క్షుక గణమొండు కానఁబడ కోమలి నేత్రపుటమ్ము లార్చుచున్.

ఆదెసకే కనుంగొనుచు నాయత భిక్షుగణమ్ము మెల్లఁగా
నీదెస కేగుదెంచి మది కింపుగ గానము సేయుచుండ స
మ్మోద తరంగితాత్మయయి ముందునకున్ బఱతెంచి గీతికా
నాదము జాగరూకత వినం దొడఁగెన్ గుతుకమ్ము మీఱఁగన్.

"శరణమగు బుద్ధదైవమ్మె శరణ మగును;
శరణమగు బౌద్ధ ధర్మమ్మె శరణ మగును;
శరణమగు బౌద్ధ సంఘమ్మె శరణ మగును;
ధాత్రిఁ బ్రజకెల్ల విదె శరణత్రయమ్ము.

జాతమును బట్టి యుచ్చనీచతల నెంచి
తగవు లాడకుఁడయ్య. యథార్థమరయఁ
బ్రాణులందున భేదమ్ము పరగి యున్నఁ
బ్రాణములయందు భేదభావమ్ము గలదె ?

కుక్షి నింపుటకై జంతుకోటిఁ జంపి
రక్తమును ద్రావు రాక్షసప్రకృతి వలదు
జీవకారుణ్యభావమ్ము చివురులొత్త
బ్రదుకుఁదీవలు మలఁచికోవలయు జనులు.

బుద్ధ బోధామృతము పొంగి పొరలి పొరలి
దారుణాఖిల పాప నిదాఘ తప్త
జీవలోకమ్ము నుద్ధరించెడివి లెండు
శోక సంతప్త మానవానీక మెల్ల.

శరణమగు బుద్ధదేవమ్మె శరణ మగును;
శరణమగు బౌద్ధ ధర్మమ్మె శరణ మగును;
శరణమగు బౌద్ధ సంఘమ్మె శరణ మగును;
ధాత్రిఁ బ్రజకెల్ల నిదె శరణత్రయమ్ము."

అనుచు భిక్షుక గణము సౌహార్దమొలుకఁ
బలుకుచుండంగఁ బ్రకృతి కన్గొలుకులందు
ప్రమదపూరమ్ము పొంగి యెవ్వారొ తనదు
పసి యెడందను జోకొట్టు పగిది పొలిచె.

భిక్షుతతిలోన నొక్క గంభీర దృష్టి
మేని కాషాయ పటునిటు మెరసియాడ
బౌద్ధధర్మమ్ము గొంతెత్తి పాడుచుండెఁ
గడమభిక్షుకు లతనితోఁ గలిసి పలుక.

జలదధ్వని గంభీరత
గళ మొప్పఁగఁ బాడు భిక్షుకప్రవరుఁడు మం
జుల కంఠము తడియారఁగఁ
బలుకాడక "దాహ" మంచు బయలం జూచెన్.

ఆ వికటమ్మునందు హృదయాబ్జము దోసిటఁబట్టి కూర్మిమై
కానుకవెట్టు చందమునఁ గన్గొనెఁ గన్నియ మౌనివర్యుఁ; డ
మ్మౌనియు నిర్వికారగతి మానిని డగ్గఱి "నీళ్ళవోయు" మం
చానత శీర్షుఁడై పలికె, నాయమ గుండెలు జల్దరింపఁగన్.

"మునిమార్తాండుఁడు 'దాహ' మంచును గరమ్మల్ సాచి చండాలక
న్యను నన్ వేడుటయా? మహోజ్జ్వల వపుర్నైర్మల్య మొప్పారు నీ
తనిఁ గన్నెత్తి కనంగ నోడుదుఁగదా! తానేల నన్నిట్లు కో
రెను, కట్టా!" యనుకొంచుఁ గోమలి వితర్కించంగ నమ్మౌనియున్,

"దాహము, దాహ"మంచు వడదాకిన దీనులు కూయివెట్ట సం
దేహములేల యో మగువ, తీయని నీళులు వోసి పున్నెపున్
గేహము మెట్టు; మీ భయద కృచ్ఛ్రి నిదాఘము నోర్వలేక మూ
ర్ఛాహతి నందెఁ బ్రాణితతి; చల్లని నీళులె మందు దీనికిన్.

అనఁగ యువభిక్షు నాననం బరసిచూచి
"చాలు చాల్బాబు, మాది చండాలజన్మ,
దివ్యతేజమ్ము లొలయు శ్రోత్రియుల కెట్లు
పనికివచ్చును మే మొసంగిన జలమ్ము?"

అనుచు నించుక వెనుకకుఁ జనియెఁ బ్రకృతి
సంతతానంద కందళితాంతరంగుఁ
డా ఘనానందుఁ డొక మందహాస మొలికి
యాయమ యమాయికోక్తుల కనియె నిటులు.

"పరమ కోమల సుందర ప్రకృతి - ప్రకృతి -
జన్మతో నిందుఁ బాపభాజనులు లేరు.
నిన్ను నీవేల యిట్లు నిందించుకొందు?
వాత్మదూషణ మిగుల గర్హ్యమ్ము సుమ్ము.

నే నెటులు మానవుండనో నీవు నటులె
మానవివి; కాన మనుజ ధర్మంబు సమము;
మానవత్వంబు సామాన్యమైన గుణము.
తక్కుఁగల భేదములు కల్పితములు చూవె.

నీవు తాకినమాత్ర నీ నీరు లెటులు
కలుషితము లౌను? సర్వజగమ్ములోనఁ
బ్రాణికోటుల దప్పి తీర్పంగఁజాలు
స్వాదుజల మది యెందేని స్వచ్ఛతమమె.

శ్రావణ కాల మేఘములు చల్లని స్వాదుజలమ్ము లొల్కఁ బా
ధావిల జీవకోటులకు హాయి నొసంగవె ? వర్ణభేదముల్
భావనచేసి పావన జలమ్ములు ప్రక్కకుఁ ద్రోతురా కొ్కఁ ? ఏ
లా వెనుకాడె ? దించుక జలమ్మిడి ప్రాణము నిల్పు మంగనా !"

అనుచున్ దోసిలివట్టి హాసవదనుండై చూచు నమ్మౌని ము
ఖ్యునిఁ గన్నార్పక చూచి కన్నె మది సంకోచమ్ములన్ బాసి, చ
య్యన సుస్వాదుజలమ్ముతెచ్చి మునిహస్తాంభోజయుగ్మంబునన్
దన సర్వస్వము ధారవోయుగతిఁ దృప్తస్వాంతయై పోయుచున్.

"నను, జండాలిని, సంస్కరించెడు మహానందైక సామ్రాజ్య ధు
ర్యుని నేరీతిని సత్కరింపనగు"నం చూహించి, యమ్మౌని మం
డను శ్రీపాదయుగమ్ముపైఁబడి "వినూత్నంబైన యీ జీవనం
బునకున్ దాతవు, త్రాత వీవె"యనె సమ్మోదాశ్రుపూర్ణాక్షియై.

ఆ చండాలిక చిన్నిమానసము లీలానంద కేలీవనీ
వ్యాచిక్రింసకు మోమువాచి, ప్రణయ ప్రారంభ సంరంభ సా
మీచీన్యామల సాధుసంగత శుచి స్మేరార్ద్ర దృగ్రోచియై
చూచెం బూచిన పారిజాతములు రాసుల్ రాసులై రాలగన్.

సంతత బ్రహ్మచర్య దీక్షా కఠోరుఁ
డమ్మునీశ్వరుఁ డూపిరియైన సలిపి
కొన నశక్తుఁడై నిలువ నక్కోమలాంగి
క్రొవ్వలపు ఘుంఘుమార్భటుల్ కొసరి ముసరె.

క్రొవ్వలపున్ ఘుమంఘుమలు గుప్పన ఘ్రాణముఁ జొచ్చి, గుండెలోఁ
గవ్వము ద్రిప్పినట్లు - సుడిగాలులు చండతరోగ్రఘాటిఁ బెన్
దువ్వను రేఁపినట్లు - ఘనధూమము కావురు గ్రమ్మినట్లు - లో
దివ్వె చలించినట్లు మునిధీరుని దృష్టి పరిభ్రమింపఁగన్.

తన తనువల్లి సంయమి పదమ్ములకున్ బెను పాప బంధమో
యనఁ బెనవైచి వ్రాలె లలితాంగి; తదంసయుగమ్మునంటి చ
య్యనఁ బయికెత్తి "బుద్ధుఁడు దయామతి నిన్ గనుగాత" మంచు దీ
వెనయిడి నిర్వికారతను భిక్షువతంసము ప్రక్కకేగినన్.

తనకు సర్వమ్ము తెలిసిన యనువు దోఁప
లేఁగ యాదూడ ఆనందయోగిఁ గదిసి
పాదయుగళమ్ము మూర్కొని పయికిఁజూచి
ప్రకృతిఁ గనుగొని యఱచె 'నంబా' యటంచు.

చిన్ని యాదూడ చేష్టకుఁ జిత్త మలరి
మౌనిమణి ముద్దుగా దాని మేను దువ్వెఁ:
ఆత్మ కింపైన యాదృశ్య మరయుచున్న
సాధు సంఘమ్ము ప్రమద బాష్పములు కురిసె.

చండ కిరణుండు సైత మాశ్చర్యపడుచు
గోముగా లేఁగ దూడఁ గన్గొనియెఁ; గాని
కాల ధర్మానుగుణముగాఁ గరసహస్ర
ముగ్రధాటిని బుడమిపై కుఱుకఁజేసె.

భగ్గున మింట మండిపడువాఁడయి చండగభస్తి కన్నె క
న్నొగ్గల నగ్గిచిమ్మ మునిముఖ్యుని మై మసృణంపు స్వేదపున్
నిగ్గులు నింపెఁ; జెంగట మునిప్రతతుల్ పటుతాప వహ్ని కి
లిగ్గులు గాఁగఁ దూలి యెలుగింపఁగ సౌగత గీతికాతతిన్.

"శరణము బుద్ధదైవ"మని సాగిరి సాధులు రాజవీథిలో
"శరణము బుద్ధదైవ"మని సంయమి ముఖ్యుఁడు సాగె; నంతలో
"శరణము సంయమిప్రవర! సౌగతసూక్తి మరంద మాధురీ
భర, శరణ"మ్మటంచుఁ జెలిప్రాలె విచిత్రపుఁ జిత్రమో యనన్.

కనులెత్తి చూచునంతకు
మునిసంఘము దూరదూరమున హంసల గుం
పన మెల్లన నడయాడుచుఁ
గనిపించెను బ్రకృతి చిత్తకమలము సుడియన్.

తన చెవి దారిచి యల్లన
వినదొడఁగెన్ బ్రకృతి - యంత వినిపించె నెవో
యనురణనధ్వనిగతులై
మునిసంఘ శ్రావ్యగాన ముఖరిత గీతుల్.

తన యాత్మ లోతులన్ మె
త్తని తావులు తడియఁగ నమృత మధుర ధారా
ధుని పొంగులు వెట్టించెడి
మునిమండలి మంజుగీతములు వినఁజొచ్చెన్.

తన సర్వేంద్రియ శక్తుల
కు నపూర్వానందయోగగుణ మావేశిం
చినగతిఁ బ్రకృతి యొక తప
స్విని యై లోచూపు గలిగి చెదరక నిలిచెన్.

ఆటు లెంత తడవొ గడవక
పటుతర చండాంశు తాపభర మగ్గలమై
కటకటఁబడి కుటిలాలక
"యెట నా యానందమూర్తి, యెచ్చట?" ననుచున్.

ఒకత్రుటి మాత్రఁ దెల్విగని యుగ్మలి భుగ్నశరీరయై సము
త్సుక నయనమ్ములన్ దగిలి చూచుచు సాధువతంసు శుద్ధ సా
త్త్వక తను యష్టి దృష్టి పదవిన్ గనిపింపక పోవుచోటఁ బా
యక హృదయమ్ముఁ జొన్పి తరళాకృతులన్ గనసాగెఁ జిత్రముల్.

సర్వవిజ్ఞాన తేజఃపుంజములు చిమ్ము
కమనీయ ఫాలభాగమ్మువాఁడు
జీవకారుణ్య సుస్నిగ్ధ సుందరమైన
గంభీర నేత్రయుగ్మమ్మువాఁడు
సంప్రాప్త గుణగణార్ణవ సూచకమ్మైన
రమణీయ నాసికాగ్రమ్మువాఁడు
ధర్మ సంస్థాపనార్థమ్ము కమ్మగ మ్రోయు
ప్రణయార్ద్ర కంఠనిస్వనమువాఁడు

నిత్య సత్య దయాశౌచ నియతబుద్ధి
శ్రీఘనానందుఁ డతఁ డొక్క చిన్నిప్రేమ
మూర్తియై, స్వప్నగత మధుమూర్తియై, న
టింపసాగె నా ప్రకృతి కంటికొనలందు.

ఒకమాఱు దీర్ఘబాహువు సాచి తనపైనఁ
గొమరొప్ప దీవనల్ కురిసినట్లు
ఒకమాఱు దృష్టికందక దూరముగఁబోయి
విమల గాంధర్వంబు వినిచినట్లు
ఒకమాఱు తనకు ధర్మోపదేశము చేసి
దివ్యదృష్టిని ప్రసాదించినట్లు
ఒకమాఱు దప్పితీఱక 'నీళ్ళు నీ' ళ్ళని
దీనుఁడై తన్ను ప్రార్థించినట్లు

నిఖిలజగములఁ బండువెన్నెలలు చిలుకు
నవ్యయానంద పూర్ణ శశాంకమూర్తి
తన మనఃకోకనదమునఁ దనరినట్లు
గుబ్బతిలునూహఁ బ్రకృతి పెల్లుబ్బిపోయె.

అంతలో సర్వజగము శూన్యముగఁ దోఁచి
పులుకుపులుకునఁ జూచుచుఁ బోయెఁ బ్రకృతి
లేఁగదూడయు నామెతో నేగె; మింట
ఖరకరుఁడు చంద్రనిప్పులు చెరిగిపోయె.

గతమయ్యేన్ గుతపమ్ము; గుండె లవియంగన్ రౌహిణేయమ్ము తీ
వ్రత సూపెన్; గడుఁ జిత్రమౌచుఁ బ్రకృతివ్యాప్తత్రపారోచిరు
ద్గత ముగ్ధప్రణయ ప్రభాపటలి సాంద్రానందరేఖా పుర
స్కృతమై పర్వెఁ, దిరస్కృతాత్మ విభవశ్రీ చుంచుహేవాకమై.

## ఆకాంక్ష

శ్రావస్తిపుర పరిశ్రాంత దుర్జన దూషి
తాత్మాభిమాన పర్యాప్త బుద్ధి
ముని మనోంబుజ నవామోద మాధ్వీపాన
మత్త చండాలినీ చిత్తవృత్తి
యతి మూర్ధమణి మనోహర దీప్తి సంపాత
కిలికించి తాత్మ సంవలిత దృష్టి
ఆనంద విరహ తప్తాత్మావలోకన
స్ఫురిత పంచేంద్రియ క్షుభితమూర్తి

ప్రకృతి - తా నెద్దియో వెడపలుకు పలుకు
గువ్వకుత్తుకతో బిట్టు కుతిలపడుచు
నడుగులో నడ్గు వెట్టుచు నడచి నడచి
యాత్మగేహమ్ము దిక్కుగా నరుగఁ దివురు.

ద్రాగన్నువడి వేఁపద్రాని నీడను గూర్కు-
బసవన్న శుద్ధ సత్త్వ ప్రవృత్తి
బురదలోపల దేహమును ముంచి పొరలాడు
మహిషరాజన్యు తామసగుణమ్ము
శృంగమ్ములొడ్డి యుజ్జిఁదలంచి డీకొట్టు
పొట్టేలి రాజసాభ్యుదయ గరిమ
"లేవనే లేవఁడు లేచెనా .... " యనఁజూచు
పెను మేఁకపోతు గాంభీర్య మహిమ
యొక్కచోఁజేరి బ్రదుకులో నొదిగియున్న
వివిధజీవుల చిత్తప్రవృత్తు లెల్ల
లీలగాఁదెల్పు నొక్క చండాలవాటి
పొలుచు నల్లదె శ్రావస్తిపురము నంటి.

ఒక మఱ్ఱినీడ నిద్రకుఁజొచ్చి గూడెపుఁ
బెద్ద పెద్దగ గుఱ్ఱువెట్ట దొడఁగె
కల్లు పెల్లాని యొక్కఁడు మందుటిసుకలో
నట్టిటు తూఁగి దోఁగాడ దొడఁగె

తొడగొట్టి కవ్వించి మడమ త్రిప్పక పోరె
మల్లుఁ డొక్కఁడు తోడి మల్లు తోడ
"వదలిపెట్టుఁడు నన్ను వైరి గుండెలు ప్రీల్తు"
నని యొక్క భీరు వట్టాడఁ దొడఁగె

భిన్నగుణముల ప్రోవుగా నున్నయట్టి
బుద్ధి వొదవెడు రుచిభేదములనుబట్టి
కలకలము సేయు జనముల కలిమి బలిమి
వెనఁగు వెలివాడ సందడి కేమి కొఱత?

ఇంచుకంత ముందున కేగ నేదొ పెద్ద
రణగుణధ్వని - ధణధణం ధణరవమ్ము
మొరసి వినబడఁ దొడఁగె; నమ్మూల నేల
గుంపుగా గూడెపుం బ్రజ కూడియుండె?

పెండ్లి కాబోలు నేరిదో, పెళపెళమని
పటహవాద్యాలు మ్రోగు దంపతుల మ్రోలఁ
దాళలయగతు లొప్ప నర్తనము సేయ
జానపదసుందరులు పరస్పర జిగీష.

కనకతప్పెట ఘణంఘణ మ్రోయ దరువు ల
　　　　క్షించి తాండవమాడెఁ జిందుగాఁడు
పంబరేగఁగ ద్రుతాలంబి తాళస్ఫూర్తిఁ
　　　　జండాలి యాడె నుద్దండ లీల
నాస్కందితాది గత్యనుకూల ఫణితి న
　　　　శ్వమునార్చె నాట్యశిక్షకుఁ డొకండు
తతవాద్య సుస్వరత్వర నొక్క ప్లవకన్య
　　　　పదమెత్తి పరవశత్వమునఁ బాడె
ముద్దు లేదంపతుల కొడల్ పులకరించి
దృఙ్మనస్సంగమాకాంక్ష తీవరింప
నొండొరులు మునివ్రేళుల నూదికొనుచుఁ
గొమరు గులుకంగ వారిఁ గన్గొనియెఁ బ్రకృతి.

మురిపెపు దంపతుల్ మనసుపొంగఁ బదింబది ప్రేమభావ భా
సుర దరహాసకాంతి జిగిచూపుల సిగ్గులు చిందఁజూచినన్
పరవశదృష్టియై ప్రకృతి వారిఁగనుంగొనె; నంత నాత్మలో
సురుచిర మౌనిముఖ్య పరిశుద్ధ పరిష్కృతమూర్తి తోఁచినన్.

నే నానంద మునిప్రభు ప్రణయవాణీ మంజువీణా మృదు
స్వాన స్వాదు మధుప్రలుబ్ధమతినై చండాలినీకేళి నెం
తే నానందము నొందు కాలమది రానేరాదా ! ఈ జన్మలో
నానోముల్ ఫలియింప వాక్కొ సరె, పో ! నా కంత భాగ్యం బొకో !!

ఎందుల కింత వేదన? మునీశ్వరు మంజుల వాక్యధోరణిన్
జిందిన తీయతేనియలు చిత్తముఁ జొక్కఁగఁజేసె; నింతగా
సుందర నూతనప్రకృతిశోభలు నాయెద నింపి తానె యా
నందకుమారమౌని నను నాశ మొనర్పఁగ నూహ సేయునే?

అంతటి శాంతచిత్తుఁడు "దయామతి నిన్ గనుగాత బుద్ధుఁ"డం
చెంతయు జాలి జాలుకొన నెత్తె ననున్ దనువూది, యింతలో
వంతలపాలుసేయు నొకొ ? బౌద్ధుల దృష్టిని జీవహింస య
త్యంతము పాపకార్యముగదా ! ముని తా నదియైన నెంచఁడో !

ఎంచక యెట్టు లుండఁ గలఁ ? డింపుగ దిక్కులఁ గ్రొత్తతావులన్
ముంచెడు నాయెడంద వలపుంబువుఁ దొల్తన మూరుకొంచుఁ బో
నెంచిన నైతునే ? సయిప కేమి యొనర్తు ? విదేల యిట్లు భా
వించుట ? మౌని మానసము ప్రేమ విరుద్ధత నుండినంగదా !

అతని మనోజ్ఞ మానసమునం దొక సుందర రాజహంసినై
కుతుకము మీఱఁ బ్రేమ కలకూజితముం బొనరింతు; సారస
ప్లుతగతిఁ దేలి మౌని మదిలోతులఁ బ్రేమ మృణాళ వల్లరీ
వితతులు చొన్పియుం గలియఁ బెట్టెద జీవనతత్త్వ మారయన్.

మౌనుల జీవితమ్ము లణుమాత్రములై కనిపించుఁగాని యెం
తేని గభీరముల్; కొలఁకులే యని డిగ్గఁగఁ జూతుమేని, యౌ
రా! నదులై నదమ్ములయి యంబుధులై పయిదూకునంట; య
మ్మౌని మనోంబుధిన్ మునిఁగి మత్ప్రియ జీవితమున్ దృజింతునే!

అందఱు మౌను లట్టు లతఁ డందని లోతుల గుండెవాఁడొకో!
అందము చిందు చిత్తసుమ మందలి స్నేహమరంద మొల్కి నా
డెందము దప్పిఁ దీర్చె; నతఁడే నడిసంద్రమునందు ద్రోయ నా
నంద తరంగ రంగమున నాట్యము సేయుచుఁ గన్నుమూసెదన్.

కమ్మఁగ మాటలాడి మదిగాయము మాన్పిన ప్రేమమూర్తియౌ
అమ్మునికోసమై బ్రదుకునైనఁ ద్యజింతును; దానికేమి? మా
యమ్మ మదేక పుత్త్రిక; మహామతి; యామెకు నేను తప్ప లే
కమ్మిక లేద; ఆమె కొఱకై బ్రదుకున్ భరియింపఁగా వలెన్.

పరమ విజ్ఞానశేవధి యంట నాతండ్రి
కలవయి పోయె మా కండ్ల కెపుడొ!
ఇంత యప్పటినుండి యెడఁద చూఱలొసంగి
గోముగాఁ బెంచె నన్ గూర్మి తల్లి
నిముసమ్ము నేను గన్పింపక యున్నఁ దా
నింటింట నన్ను గాలింపఁ బోవు
కుతుకమ్ము మీఱ నజా గుడువఁబెట్టియెకాని
యెంగిలిపడదు తానెన్నఁడేని
అట్టి ప్రాణమ్ము ప్రాణమౌ అమ్మ విడచి
యెందుఁబోవుదు? నెందుల కింద నందు
నేగుటలు? బిరబిర నింటి కేగి సకల
మామె కెఱిఁగింతు; నామెయే యరయుఁ బిదప.

మహితవిజ్ఞాన సమ్యగ్దృష్టి మాయమ్మ
తా నిడె నాకు విజ్ఞాన భిక్ష;
ప్లవకన్యనై మునిప్రవరుఁ గోరితి నంచు
నెడఁదలోఁ గటకటం బడదె తాను?

ముని దృష్టి నాభేదములు లేవు గావున
మనసు తా సరిపెట్టుకొనఁగవచ్చు
మౌని యెట్లేని సమ్మతి చూపెనా, మమ్ము
కనులపండువుగ తాఁ గాంచి మరియు

భిక్షు వొకవేళ భీష్మించి బిఱ్ఱబిగియ
తన మహా మంత్ర తంత్ర విద్యావిరూఢి
నష్ట దిగ్బంధ మొనరించి యతని నిట్టె
పట్టి తోడ్తెచ్చి నా ముందుఁ బెట్టకున్నె ?

సంయమిశ్రేష్ఠు లతిలోక శక్తి యుక్తు
లాగతానాగత జ్ఞానయోగ దృష్టి
సృష్టికిం బ్రతిసృష్టిని జేయఁగలుగు
వలఁతు లని యప్పు డప్పుడు వలుకు నంబ.

'అట్టి మునిముఖ్యు ముందు మా యమ్మ మంత్ర
పటిమ యేమౌనొ' యని భయంపడుదుఁ, గాని
యామె మాత్రము సామాన్యురాలె తలఁప !
భ్రుకుటి ముడివైచి కన జగంబులు వణఁకవె ?"

అంచు భామిని శిరసు పంకించి నిలిచి
"యెందుఁ బోవునులే యిమ్మునీశ్వరుండు
చూతుగా," యని చుఱచుఱ చూచి కొంత
దవ్వరుగుదెంచె లోలోన నవ్వికొనుచు.

ఉడుగని యూహతంతువులె యూతగ నీగతి సాగివచ్చు న
ప్పడఁతుక మాతృతంత్ర దృఢపంజరబద్ధ మనోజ్ఞ కీరమై
సుడిగొనువానిఁ బోలె మునిఁజూచుచు "చిక్కితివోయి మౌని ము
ఖ్యుఁడ!" యనుకొంచు క్రేళ్లుఱుకుచుండె జనంగమ వాటికాస్థలిన్.

చిత్తమానందయోగ సంస్కృతిని దనియఁ
బ్రకృతి తెలివొంది చూడ నంతికమునందు
దళముగా మ్రోఁగు పటహవాద్యములు లేవు!
పసుపు బట్టల పూపదంపతులు లేరు!

ఆకలు తీవలల్లి వలయాకృతులై కడలొత్తి యొత్తి రా
కాళశి సుందరప్రకృతి కన్నులఁ దేలి తదీయ భావనా
కాశమునన్ వెలుంగు మునికాముని కాయముచుట్టి జ్యోత్స్నికా
పేశల వల్లులై ప్రణయపిశ్వము ప్రాఁకినయట్లు తోఁచినన్.

పగలుమాయని వెన్నెల బ్రదుకు పసకు
పగులఁబడి నవ్వెనా యన పద్మహితుని
శ్రీ జగచ్చక్షువున నెఱ్ఱజీఱ లలమి
విశ్వమెల్లెడ మలిసంజ వెలుఁగు విరిసె.

శీతల శ్వేత సుందరస్ఫీత మయిన
హిమనగము మీఁద చిత్ర వర్ణములు పఱచి
పరువులిడి వచ్చి శ్రావస్తిపురము సొచ్చి
సంజవెలుఁగులు వెలివాడఁ జాఁగి నిలిచె.

నీడాంతమున నుండి నిక్కి కన్గొను కూన
నరయంగ నొక పక్షి పరుగువాఱె
పొదుగు క్రుమ్మెడు బిడ్డఁ బొదివి పుల్కలఁదేఱ
మేఁక యొక్కఁడు పొలిమేర నిలిచె
ఇల్లిల్లు దిరిగి యెల్లేని పిల్లలఁబెంచు
పిల్లి యొక్కఁడు గాదెవెన్క విడిసె
పొట్ట గట్టిగఁబట్టు బొట్టెమై పేల్దువ్వి
కోఁతి యొక్కఁడు కొమ్మ కొమ్మ దూఱె

తల్లి పిల్లలకును బిల్ల తల్లులకును
ప్రణయరాగమ్ము నెడఁదలోఁ బాదుకొలిపి
ముదురుఁ బ్రాయంపు మలిసంజ ముదిమియెండ
అల్లనల్లన వెలివాడ వెల్లివొడిచె.

# అనుతాపము

మలిసంజ ముదిమి నిగ్గులు శ్రేణిచేసెడు
నిడుద కెంజడలు మైఁ గదలుకొనఁగ
భసిత పుండ్రముల పైఁ బఱగు గంధపుబొట్టు
పాటల రుచి నింప ఫాలపట్టి
బ్రహ్మనైనను మంత్రపటిమ నట్టిటు లూపు
దివ్యశక్తులు నేత్రదీప్తి నెఱయ
ఆత్మప్రకృతి కద్దమగు ధూర్తులను మొత్తు
నాగబెత్తము చేత నాట్యమాడ

ఆదిశక్తి స్వరూపిణి యవతరించి
అవని నడయాడి వచ్చిన యట్లు వచ్చెఁ
"ప్రకృతి, ప్రకృతీః" యటంచు దిగ్వలయమెల్ల
మాఱుమ్రోగంగ నఱచుచు మగువ యోర్తు.

పయికి భయదోగ్ర చటుల రూపమ్మె యైన
మనసులో కోటి తల్లుల మమత కలిమి
'ప్రకృతి' యని కేకవెట్టుచు వచ్చు నామె
ప్రకృతి మాతయ కాక యెవ్వరు తలంప?

"పొలముల కేగినట్టి పశువుల్ తమి నిండ్లకు నేగుదెంచె; ము
ద్దులమెడ లెత్తి యెత్తి పసిదూడలు తల్లులఁ జేరె; నెట్టి క్రం
తలఁబడి పోయెనో, సుత కనంబడదాయె" నటంచు పేరు టు
మ్మలికను జూచె నా ప్రకృతిమాత పదింబది సందుగొందులన్

కొండ చఱుల దొరలి గొనగొనఁ బాఱెడు
సెలల చిన్ని తుంపురులకుఁ బోలె
లీలఁ బెటిలిపడుచు లేఁగ యొక్కఁడె వచ్చి
మలపె నంత ప్రకృతి మాత చెంత.

లేఁగ మై దువ్వి యామె యీ లీలఁ బలికెఁ
"బ్రకృతికిన్ దండ్రి కఱవైన పగిది నీకు
తల్లి కఱవాయెఁ గద చిన్నతనమునందె
ఏను కడచన్న మీగతి యేమి యగునొ?

అన్నమైనను ముట్ట కంత కట్టెండలో
అప్పుడనఁగఁ బోయి యిప్పటివఱ
కుఁ గనిపింపరయితిరి గద! మీ యాఁకలై
నను మీ రెఱుఁగరు. దినము లేమి
జాగుగ లేవు. త్రోవల దొంకలన్ దొంగ
మూఁకలు పట్టి కొంపోయెనేని
మీరు ప్రాణమ్ముగా మేను నిల్పిన నాకు
బ్రదుకింకఁ గలదె? ఆ ప్రకృతి కేమి
హద్దు పద్దులు లేవు; తానైన నేమి
చిన్నదా? పెండ్లియాడు వచ్చినదె! యింత
వఱకు రాదాయె! మీర లిర్వు రెటకేగి?
రీ వొకఁడవె వచ్చితివి. తా నేల రాదు?

ఇట్టులే నన్ను హింసించెనేని తాను.
ఎవనికో ఒక్కనికిఁ ద్రోవనేగువాని
కిచ్చి ముడివెట్టి పంపెద నెచటికేని;
నే నెట్లైనను నేమి. ఆపైనఁ దనకు?"

అనుచు నాయమ కదలి పొంగిన విధాన
నశ్రువులు పొంగఁగా నేడ్చె; నంతలోనె
యాననేందుండు వెన్నెల లారఁబోయఁ
బ్రకృతి పఱతెంచి తల్లిపై వ్రాలి నిలిచి.

"అమ్మ సర్వజ్ఞురాలు, తనంత తానె
ముని విశేషమ్ము గ్రహియింపఁబోలు; కాక
'యెవనికో ఒక్కనికిఁ ద్రోవనేగువాని
కిచ్చి ముడివైతు'నని పల్కనేల యిపుడు ?

ఐన నేమాయె, విషయమ్ము నేన తడవి
అమ్మ హృదయమ్ము గ్రహియింతు"ననుచు నింటి
కరుగు దనుక నోరిమి లేక యామె మోము
చూడకయె సంజ వెలుఁగులు చూచి చూచి.

మనసులోన సుస్పష్టమై మనలు కోర్కి
మాటలో స్పష్టముగఁ జెప్ప మనసు రాక
ఆకసము చూచి యమ్మహస్తాగ్ర మూది
అల్లనల్లన నడచుచు నడిగె నిట్లు.

"ఈ సంజ యిదియేమి, ఇంత క్రొత్తగ నుండె
ఈ చిత్ర వర్ణమ్ము లేమి జగతి?
అటు చూడ నస్త్రాద్రి నబ్జహితుం డేమి?
ఇటు చూడ నుదయాద్రి నిందుఁ డేమి?
ఆ సంజ కెంజాయలం దల్లిబిల్లిగా
ఈ వింత వెన్నెల తీవ లేమి?
అటు రవి రాజసం; బిటు శశి సత్త్వంబు;
మహి నింకఁ దమ మెట్లు మసలఁగలదు?

అంబరము సూర్య చంద్రుల కాటపట్టు
జలము లెండిన మనవాడ కొలనిలోని
పేద కుముదమ్ము పై వింత వెలుఁగు లొలపె,
నమ్మ, యీ వింత వెలుఁగుల కర్థ మేమి?

అట హిమాంశువు శీతలాశాంత దృష్టి
ఇట నౌకానౌక కుముద సౌహృద సమృద్ధి
పాటలాశారుచుల్ పల్కు పలుచ నయ్యె;
అమ్మ, యీ సంజ వెన్నెల కర్థమేమి?

హిమనగాధిప వర్ణభేదములు లేని
యమృతశీతల సామ్రాజ్యమందు విరిసి
నిండు చందురు పండు వెన్నెలలు కురిసె;
అమ్మ, యీ పండు వెన్నెల కర్థ మేమి ?"

ఈగతిఁ బ్రశ్నపరంపర
సాగించుచుఁ బ్రకృతి నడువ జననియు నయ్యా
హాగమ్య మనోహర భా
వాగతి కచ్చెరువు దోఁప నాత్మజఁ గనుచున్.

"ఇది యేమీ, యిటు లెన్నఁడున్ బలుకలే; దీ ప్రౌఢశృంగార భా
వ దశా సూచక వాక్యముల్ నవనవంబై తోఁచు, నా బిడ్డ పి
న్నది, లోక మ్మొక యింతయే నెఱుఁగ; దీ నాఁ డీగతింబల్కు నా
యెద కంపిచెడు"నంచు నెంచి పయి కెంతే గూఢ వాగ్ధోరణిన్.

"ఊరున్ నాడును జుట్టి వచ్చితివి; యేవో క్రొత్తలం దెచ్చి యీ
తీరుం బ్రశ్నలు వైచుచుంటి; విఁక నా తీర్పేల ? నీ తమ్ముఁ డీ
గారాబుం బసిదూడ యుండెఁగద ? నిక్కం బీతఁడే చూచె, నె
వ్వారల్ చూచిరి ? వీఁడె చెప్పు." నని పోవంజొచ్చె కైదువ్వుచున్.

అమ్మ మనోగతిన్ ప్రకృతి యారసి చూచి "ఇదేమి యీమె వా
క్యమ్ములు కోప ఘూర్ణితములై వినిపించెడు, నౌను, నేను మా
త్రమ్మపు దేగి యిప్పుడ గదా, అరుదెంచితి, నమ్మ కింకఁ గో
పమ్మన నుండదే ?" యనుచుఁ బల్కక యుల్కక పోయె నింటికిన్.

మును మనసారఁ దాఁ దినకపోయినఁ దల్లి భుజింప దంచుఁ జె
య్యన నొక ముద్ద నంజి మనసంతయు మౌనికుమారు చెంతకున్
జన మతిలేని దేహమది శయ్యపయిం బడియుండఁ గొయ్యవా
ఱిన యటులై, యెవో కలవరింతలుగాఁ బలవించుచుండఁగన్.

ఒక్కచోఁ గాలు కుదురని యుడుకు పిండ
మావుదూడ అట్టిటు దూఁకి అమ్మ చేతి
నాగబెత్తమ్ము మునిపంట లాగి తెచ్చి
ప్రకృతి పర్యంకమునఁ బాఱవైచి పోయె.

తత్తఱంపడి లేచి బెత్తమ్ము చూచి
ప్రకృతి గృహమెల్ల నవధానపరత నరసి
మాతృ తంత్రప్రయోగ సామగ్రి సరణి
సర్వమునఁ దానయై మునీశ్వరునిఁ గాంచె.

మంత్ర సంధానిత మహితాక్షమాలిక
యతి మీఁది దగు నిజాపాంగ మనఁగ
తంత్ర విన్యస్త సుందర రంగవల్లిక
తపసిపైఁ దన ప్రేమతంతు వనఁగ
అఖిలార్థ సందర్శ కాంచన పేటిక
మునిఁ గాంచు నిజ నేత్ర పుట మనంగ
సర్వసృష్టి ప్రదర్శక మహాదర్శమ్ము
యమి వెల్గు లోలయు నిజాత్మ యనఁగఁ
దలఁచి యాయమ యానందజలధిఁదేలు;
నంతలో నమ్మ కోపవాక్యమ్ము లెంచి
యుస్సు రని శయ్యపై వ్రాలు; నుదరిపడుచు
గుండె ధృతివాయు; లోలోనఁ గుమిలి యేడ్చు.

ఏడ్చి యేడ్చి యొక్కొక సారి యింతి దృష్టి
సాగి శ్రావస్తిపురిని నిష్కారణముగ
తనను దూషించినట్టి దూర్త జనులపయి
వ్రాలు; నంతలోనన మౌనిపయిన వ్రాలు.

"మౌని ప్రణయ ప్రపూర్ణుఁడౌ మానవుండు
జనులయందును గొందఱు జంతుసములు
నిజమునకు రాక్షసుండైన నృపతికంటె
ప్రణయ మధుమూర్తి ముని గొప్పవాఁడు కాఁడె?"

అనుచుఁ దలపోసికొనుచుఁ గన్గొనలు మూసి
ముగుద పర్యంకమున సోలిపోవ నొక్క-
తెలి చిఱుమొయిలు కనులపైఁ దేలియాడి
సుందరస్వప్న జగతి కీడ్చుకొని పోయె.

"అది హిమశైల సుందర వనాంతర; మా వనసీమలో మహా
నదులు; నదీతటంబుల ఘనంబగు శాద్వల భూము; లందులో
మదమున సంచరించు మృగమండలి; యా మృగమండలిన్ మహా
భ్యుదయ పరంపరన్ గదలిపోవు కరీంద్ర మృగేంద్ర బృందముల్.

కరి ఘీంకారము, సింహ గర్జనము, వ్యాఘ్రధ్వానమున్, ఘోణి ఘు
ర్ఘుర నిర్ఘోషము, భీషణంబయి మహా ఘోరంబుగన్ మ్రోఁగ, సుం
దర భూపాలసుతుం డొకండు మృగయార్థంబై రథారూఢుఁడై
యరుదెంచెన్ ఘననాద మేదుర ధనుర్జ్యారావ మేపారఁగన్.

కరులన్ నుగ్గొనరించి బెబ్బులుల మూఁకం జెండి, సింగంబులన్
సుఖమాడన్ మనుబిళ్ళ లేళ్ళుఁ బళుసందోహంబు లుద్భ్రాంతమై
పఱువం జొచ్చెఁ; నృపాలసూనుఁ డనుకంపాశూన్యుఁడై తచ్ఛిఖా
త్కారమున్ గాళులు రావి వానిని దెగంగా నేసి పెల్లార్చుచున్.

చనిచని కాంచె నంత హిమశైల పదాంతిక చారు భూములన్
గొనగొన బాఱునట్టి హిమకుల్య తటంబునఁ బొల్చు శాద్వలం
బున నునులేఁత పచ్చికలు ముద్దుల లేఁగకు నందియిచ్చుచున్
గొనబుఁ బదాలు పాడు నొక కోమల బాలిక దృష్టి జాలికన్.

కనుగొని రాజనందనుఁడు గ్రక్కున డిగ్గె రథంబు; చారు లో
చన చకితాక్షియై హరిణశాబకమో యనఁ జెంగలించుచున్
జనిచని యొక్క పూవుఁబొద చాటున డాఁగి నృపాలసూతిఁ గ
న్గొనియె; నతండు నట్టిటు కనుంగొని కోమలి కానరామికిన్.

కనులన్ నిప్పులు రాల్చి, క్రేళ్లుఱుకు లేఁగన్ గాంచి క్రొవ్వాలు ట
మ్మున నేసెన్; గిఱుగిఱ్ఱునం దిరిగి మోడ్పుం గన్నులన్ వ్రాలు న
య్యనుఁగుం దూడను గాంచి వెచ్చెలి నికుంజాంతంబునన్ బేరెలుం
గున హాహారవ మాచరింప, నృపసూనుం డాత్మ నుప్పొంగుచున్.

ఆ లలితాంగిఁ జేరి "ప్రణయాంజలి బద్ధుని పైఁపు"మంచుఁ గెం
గే లొడియన్ లతాంగి యురగీ వరపూత్కృతు లొప్ప దిగ్గనన్
గేలు విదల్చి "క్రూరమతి! నీ మృగయ ప్రణయమ్ము పైఁపఁగాఁ
జాలదు జీవిజాల"మని చండి గతిన్ గని పోవ సాగినన్.

నృపసూనుండు భయంకరప్రళయ వహ్నిజ్వాలికల్ రేఁగ న
క్కుపితాక్షింగని దంతపీడన రటద్ఘోరాననుండై, నిశా
త పటూగ్రాశుగ మంది, కార్ముక గుణధ్వానంబు గావించి, శ్రో
త్ర పుటంబుల్ వగిలింప నయ్యబల మూర్ఛన్ మున్గి మైతూలఁగన్.

కొంత వడికిఁ దెలిసి కోమలి కనుగల్వ
లెట్టకేని విచ్చి చుట్టుఁ గనఁగఁ
జెంతఁజేరి తనకు సేదతీర్చుచునున్న
మౌనిచంద్రుఁ డొకఁడు కానవచ్చె.

మౌనిచంద్రు నొడిని మార్మెడ వడ వ్రాలి
యొడలినిండ వెత్తు రొలుకు లేఁగ
అల్లనల్ల కన్ను లరవిచ్చి చూడంగ
ముగుద మనసు పొంగిపోయెఁ..... .....గావి.

నరపతి సూను కార్ముక గుణధ్వని కర్ణపుటమ్ము లుచ్చి గిం
గురుమన, నట్టిటుం గనుచు కోమలి యాతఁడు కానిరామి క
చ్చెరువును బొంది, చెంతఁ దపసిం గని సర్వము వాని మాయగా
నెఱుఁగుచుఁ దత్పదమ్ములపయిం బడి ప్రీతి నమస్కరింపఁగన్.

"శరణమగు బుద్ధ దైవమ్మె శరణ"మనుచు
మౌని మెలమెల్లఁ దనదారిఁ దాను సాగె;
నశ్రుపిహితమ్ములగు లోచనాంచలముల
వాని నంతంతఁ గనుచు నబ్బాల నిలిచె"

ప్రకృతి యీ గతి నొక్క స్వప్నమ్ము గాంచి
"ఆగు మాగు మోయీ మునీ" యంచుఁ గలవ
రించుచును లేచి కనులెత్తి కాంచునంత
అమ్మ కనిపించె నాత్మ పర్యంకమందు.

"ఎవ్వరే తల్లి మునియా! అదెట్టు" లనుచుఁ
దల్లి సంభ్రమ మందుచుఁ దనయ నడిగె;
అమ్మఁ గాంచి తనూజ దుఃఖమ్ము పొంగి
పొరలి, యాపుకోలేక బావురని యేడ్చె.

అల్లన మానసం బురిసియాడఁగ నా యొక బిడ్డ యట్లు గా
సిల్లుటఁ గాంచి తల్లి కడుఁ జేడ్పడి యాత్మజ దుఃఖకార్ట్రణం
బుల్లమునం దలంచి తల యూఁచుచుఁ గన్గొనఁ, గం[illegible]ముందు వి
ద్యుల్లతలై నటించె నెవియో దృగపూర్వ విరక్త దృశ్యముల్.

"ఐనఁ గానిమ్ము. సుత హృదయమ్ము తెలిసి
యుచితగతిఁ జేయ నగు" నని యూహ చేసి
తనయ నొడిఁ జేర్చి తల్లి యోదార్చె; నంత
హాయిగా మై మఱచి నిద్రవోయెఁ బ్రకృతి.

# అనునయము

"ఉల్కలు నేలరాలె; శశియున్ జరమాద్రి పథమ్ము వట్టెఁ; గిం
జల్కము దాఁచెఁ జెందొవ; నిశా తరుణీమణి తెల్లవోయెఁ; బ
ల్కులుకుల కల్క వెన్నెల పులుంగు ప్రియుం గని దుఃఖ బాష్పముల్
చిల్కె; నిదేమి, యీ ప్రకృతి చెక్కిటఁ జిత్రపు నవ్వ వెన్నెలల్?

ఎన్నఁడు లేని నవ్వు లివి యేమి సుషుప్తిని? మెల్ల మెల్లఁగాఁ
గ్రొన్నన విచ్చినట్టు లదిగో, సుత కన్నులు విచ్చి చూచె; నన్
గన్న వరాల తల్లి, నిను గాంచు కొలందిని గుండె బ్రద్ద లౌ
చున్నది। ఇంత కా ముని మహోదయుఁ డెవ్వఁడొ చెప్పరాదటే।

ముని యన్నన్ మఱి మౌన యోగమునఁ జూపుల్ లోనికిం ద్రిప్పి కా
ముని నిర్జించిన సంయమీశుఁడు, జగన్ముక్తి ప్రదాత్రుండునై
తనరున్, దా నొక కొండకూన ననురక్తిం జేసి యీరీతిగాఁ
జనె నంచుం దలపోయ నాకుఁ బరమాశ్చర్యంబు సంధిల్లెడున్।

సాదులు రేఁగుచే యరుదు; సారస లోచన లప్పు డప్పు డిం
ద్రాదుల గుట్టు మట్టు మరియాదలు కావఁగ, క్రమ గాన నృ
త్యాదిక విద్యలన్ మునుల యాత్మల నట్టిటు లూఁపిరంట! నా
గాదిలి పట్టి యే కళలు గాని యెఱుంగ; ది డెట్లు కూడెనో ?

మును లన నందఱున్ మునులె ? ముచ్చటగా హఠ యోగ నిష్ఠలో
మునిఁగిన యట్లు పొల్చు మునిముచ్చులు వందలు వేలు; వారిలో
నిను గికురించి నీ బ్రదుకునే కబళింపఁగఁ జూచె నెవ్వఁడో
యని వగఁ గుందు దానఁ దనయా, హృదయమ్మును విప్పి చెప్పవే!

కన్నులు విచ్చియున్ గనవు, కాంచియుఁ బల్కవు; నిద్ర కాని ని
ద్ర న్నను మోసగింతువు కదా! అసలే తలచెడ్డ తల్లిపై
నెన్నఁడు లేని యీ యలుక లేటికి ? నీకును మౌన మబ్బిన
ట్లున్నది చూడ! నాకుఁ దెలియున్, ముని నెయ్యము రిత్తపోవునే?"

అనుచుం దల్లి తనూజ నూఁకొలిపి కల్యాచారముల్ తీర్పఁ బం
చిన నెట్టెట్టులొ కల్యవర్తము ముగించెన్ గూఁతు; రంతన్ దనూ
జ నొడిం జేరిచికొంచుఁ దల్లి కడు వాత్సల్యముతో "ఏది, య
మ్మని వృత్తాంతము చెప్పు, చూత"మనినం బూఁబోఁడి మో మింతయై.

"ముని యన్నన్ మునియా యతండు? హృదయమ్మున్ జూలి లీఁజాలు చే
ల్లని చూపుల్, కమనీయ వాక్కులు; సుధార్ద్రి స్నేహ భావమ్ము; లే
మని నీతో వచియించు దాన? తదపూర్వానంద మౌనీంద్ర ద
ర్శనమే యొక్క మహానుభూతి; తను సంస్పర్శంబొ...." అం చాగినన్.

ఆనందుం డనినంత తల్లి హృదయం బాకంపముం బొంద దే
హానం జెమ్మట గ్రమ్మ, మాట తడపాటై పల్కఁగా లేక యె
ట్లేనిన్ ధీరత తోఁప నిట్లనియె "నేమీ, ఎవ్వ, రానందుఁడా?
తా నా బుద్ధుని కూర్మిశిష్యుఁ డిటు కాంతా లోలుఁడై చూచెనా?

మౌనిశ్రేష్ఠుఁ డతండు విన్ గదిసి సంభాషించెనా! బౌద్ధ వి
జ్ఞానాంభోనిధి, బ్రహ్మచర్య పటుదీక్షా దక్షుఁ; డాతండు నీ
పైనన్ నెయ్యము నూలుకొల్పి, తను సంస్పర్శంబు కాంక్షించెనా?
ఓ నా తల్లి! యి దెట్లు నమ్మనగు? నీ యూహల్ విచార్యంబులౌ!

ఆనందుండు ప్రసన్న బౌద్ధ పద పద్మారాధనైకాగ్ర చి
త్తానందుండు; విపన్న విశ్వజనతాహ్లాదానుసంధాన ని
త్యానందుండు; యమాది ఘోర నియమాభ్యాసాత్త నిర్వృత్తి యో
గానందుం; డతఁ డొక్క ముద్దియను మోహావిష్టుఁడై చూచునే?"

"ఔనమ్మా, అది యంతయున్ నిజమె, మోహావిష్టుఁడై యాతఁ డె
న్నో నాతో వచియించెఁ, దీయ వలపుం జూపుల్ మిటారించి దా
హానన్ దూలినవాఁడు వోలె తన హస్తాంభోజముల్ సాచి "యో
చానా చల్లని నీళ్ళు వోయు" మని యాశల్ పొంగఁగాఁ బల్కెనే!

అంతారాగము పెంపున
నంతేవాసినియు ననక యాదరమున బు
ద్ధాంతేవాసి ననుం బ్రణ
యాంతేవాసినిగ నరయ నంబువు లిడితిన్."

అనుచు సుత పల్క సంభ్రాంత యగుచుఁ దల్లి
"ఔర, నీ మాల కర మెత్తి నీరు వోసి
తపసివర్యుని పావనత్వంబు భంగ
పఱిచినావటే" యనఁగ నప్రకృతి వెఱచి.

"లేదు లేదమ్మ ముని 'తప్పు లే' దటంచు
పూప జాబిల్లి, లోకైక దీపవల్లి,
స్నేహ దరహాసమును బ్రపంచింప నెదఁద
పొంగఁగా నొక్క చుక్క నీ రోసినాను.

ఆ యొక చుక్క మౌనివరు హస్తము సోఁకి యగాధ సాగర
న్యాయము దోఁపఁ బెల్లుబికి నా కసుమాలపు మాల పుట్టువున్
మాయఁగఁ జేసి ప్రేమమయ మానవతా మధుమూర్తిఁ జేసె న
మ్మా, యిఁక నాకు మాలతన మన్నది యెక్కడిదే తలంపఁగన్?

'మాలను మాల' నంచు మతిమాలిన మాటల నాత్మ నిందకున్
బాలుపడంగ నేల ? భువిపై జను లందఱి కున్న జీవమే
మాలకు నుండె; జీవముల మధ్య నభిన్నత గల్గ జీవులం
దేల విభిన్నతల్ ? సమతయే సుమత మ్మని నమ్మ మమ్మరో !

జన్మముచేత సాత్వికుఁ డసత్క్రియచేతను దామసుం డగున్
జన్మముచేతఁ దామసుఁడు సత్క్రియచేతను సాత్త్వికుం డగున్
జన్మము లప్రధానములు; జ్ఞాన వివేకములే ప్రధానముల్
జన్మము లర్థశూన్యములు జ్ఞాన వివేకములే సమర్థముల్."

తర్క బంధురములు, ధర్మ సుందరములు
నైన పలుకు లిట్టు లాడుచుండ
ప్రకృతి కనుల నొక్క ప్రబల విద్యుత్కాంతి
కదలఁదొడఁగె — దానిఁ గాంచి తల్లి —

కనులఁ నానంద బాష్పముల్ కదలుకొనఁగ
'యిన్ని యూహలు నాతల్లి కెట్లు వచ్చె?
మౌని దర్శన మింత కెంతేని చేయు;
నిపుడుపేక్షింతునేని ముం దెట్టు లౌనొ?

అక్కటా! బౌద్ధ మది బుద్ధి కెక్కనేని
హైందవాచారములును, వర్ణాశ్రమములు
ననుచితములై కనంబడుఁ; గనుక నిపుడె
ముద్దుపట్టి యూహలు సరిదిద్దవలయు."

అనుచుఁ గను లెట్టచేసి "ఔరౌర, పిట్ట
కొంచెమును గూఁత ఘనమయ్యెఁ; గొంకు లేక
యింత బరితెగినా; వెవ్వ రెంతలోన
నుండవలె వార లంతలో నుంట మేలు."

అనఁగ సుత సుంత సంభ్రమ మైన లేక
"ఎంతలో నుండఁగలనొ నే నంతలోనె
యుంటిఁ, గాని యమ్మని మన స్సుదధియై త
దూర్మికా డోలఁ దేల్చి న న్నూఁచివైచె.

ఏమి సేయుదు నమ్మ, నా యీ పవిత్ర
జీవితము మౌని కప్పనచేసియుంటి,
నాతతానంద మధురానుభూతిఁ దేలి
ధన్యతం గాంచుఁగాత మీ తనువు నాత్మ !

అనఁగన్ భగ్గున లేచి మండిపడినట్లై "చాలు చాల్చాలు నీ
చనవుల్ ! నక్కకు నాకలోకమునకున్ సంబంధమా ? యెంత చె
ప్పిన నీలోకమె నీకుఁగాని యితరంబే లేదు; నీపై మరల్
గొని మత్తిల్లఁగ మూర్ఖ కాఁ దతఁడు; పల్కుల్ వేయు నిం కేటికిన్ ?"

అనుచు జనని కసరినంతన యబ్బాల
మనసు చిన్నవుచ్చుకొనుచు, నెడమ
కాలి బొటనవ్రేలు నేలపై రాయుచుఁ
జూడఁదొడఁగె నెడఁగుఁజూపు లొప్ప.

అంతటఁ బ్రాణవాయువుల కాయువు పోయఁ, జతుస్సముద్ర ప
ర్యంతము బౌద్ధ ధర్మ లతికావళు లల్లఁగ; విశ్వశాంతి క
క్రాంతము 'స్వాగతం' బనుచు సత్య శివ ప్రణయాత్మ గీతికా
క్రాంత చరాచర ప్రకృతి రాగిల యోగుల గాన మొల్కనన్.

ఆ గాన పయోధిని నవ
రాగశ్రీ యనఁగ మిగుల రాజిల్లు మహా
యోగి గభీర గళస్వన
మా గోసఁగి కన్నెఁ బులకితాత్మం జేసెన్.

ఆత్మ పొంగి ప్రకృతి యాదండ నొక కొండ
చఱియ నెక్కి మౌనివరుని గాంచి
"అడుగొ వచ్చెనమ్మ. యానందముని!" యంచు
పరుగువాఱె బాలహరిణి వోలె.

బుద్ధ బోధలు శ్రావస్తిపురిని జాటి
కపిలవస్తు పురాభిముఖమ్ముగాను
యతివరుండు "భిక్షాం దేహి" యనుచు నడువ
అతివ "ప్రణయ భిక్షాం దేహి" యనుచు వచ్చె.

నియతిన్ నన్ గరుణింప నా ప్రభువు రానే వచ్చె నం చా త్రపా
మయి మౌనీంద్రుని ముందు నంజలి ఘటింపన్ మౌని హస్తాంబుజో
న్నయ సంచాలనమాత్ర నాశిషము లందఁజేసి యేగెన్, దయా
మయుఁడౌ బుద్ధుని పాదసేవకు విలంబం బౌనొ యం చాదటన్.

గ్రీష్మాతప జ్వాల కెరలి గుండెలు వ్రేల్వ
మోడువాఱిన పంటపొలము వోలె
వేఁడి గాడ్పులు మహోద్వేలమ్ములై తాఁక
జలము లెండిన కేళిసరసి వోలె
చండ మారుతము స్వేచ్ఛాజృంభణము సేయు
తూలి రాలిన పూలతోఁట వోలె
ఊష్మ ప్రతాపాగ్ని ఉగ్ర జిహ్వలు చాప
కాలి కూలిన పర్ణశాల వోలె
దెసలఁ గార్చిచ్చు కదిసిన దిక్కు దరియఁ
గాన కత్తాడు కుందేటికూన వోలె
యతివిరహ వేదనా వికలాత్మ యైన
ప్రకృతి పరిదీన మూర్తియై పడియె; నంత —

మనసు నిలువ లేక "మా యమ్మ యెం దేగె"
ననుచుఁ బ్రకృతిమాత యటకు వచ్చి,
తనయ సేద తీర్చి యనునయోక్తులఁ దేర్చి
యింటి కేగె నామె వెంటఁ గొనుచు.

# ఆకర్షణము

తొలకరి చల్లని జల్లుల
ఇలపొలఁతుక మేనఁ బులక లిగురొత్తంగన్
జిలిబిలి తెమ్మెఱ లల్లనఁ
బొలసెన్ బ్రాణులకుఁ బ్రాణములు తేరుకొనన్.

గగనమున జంటలై తూనిగలు నటించె
ధూళిఁ బిచ్చుక దంపతుల్ కేళి సలిపె
వానకోయిల కవ క్రొత్త వలపు నెఱపె
భేక మిథునమ్ము పొలయల్కఁ బెనఁగులాడె

మెఱపుఁ జూపులతో సుఖముఖిమి చూచు
జలధర ప్రభు ప్రణయ ప్రసాద మహిమ
నెలమసలినట్టి భూకాంత నివ్వటిల్లె
శాద్వలపు మేలి ముసుఁగును సవదరించి.

పుడమి యొక చిన్ని చూలాలు వోలెఁ దోఁప
ప్రకృతిమాత "నా ముద్దుల పట్టి కెప్పు
డట్టి భాగ్యమ్ము కలుగునో" యనుచుఁ దలఁచి
తపసి కథ గుర్తునకు వచ్చి తల్లడిల్లె.

"అయ్యొయో, అన్నపానమ్ము, లాట, పాట,
మాట మంతియు నన్నియు మాయ మయ్యె
మౌని యెడబాటు సయిపంగలేని ప్రకృతి
చిక్కి సగమౌచు శల్యావశిష్ట యయ్యె.

ఇపుడు నే నూరకున్నచో నింక బిడ్డ
చేతికిం దక్క" దనుచు యోజించి యామె
తనయదరిఁజేరి "యోసి నా తల్లి, లెమ్ము
చింత మానుము, నీ యభీప్సితము తీర్తు.

ఇంత కాలము నీ మన స్సెంత దిటవు
గా మునీశ్వరుపైని లగ్నమయినదియొ
కనుగొనఁగ వేచియుంటిని గావి నా య
పూర్వ మంత్రశక్తి కసాధ్యములును గలవె?

రమ్మ, ముని మన కెంత దూరమున నున్న
విట్టె కొనితెచ్చి నీ ముందు బెట్టు దాన,
నొక్కగా నొక్క సుతవు నే నుండఁగానె
యిట్లు చింతిల్లఁ జూచి సహించు టెట్లు ?"

అంచు వాత్సల్య భావ ప్రపంచితాత్మ
యగుచు ధ్యాన మందిరమున కరిగి పరమ
యోగ నిష్ఠా గరిష్ఠత నొప్పి తనయ
దైన యాగామి వృత్తాంత మరయఁ దొడఁగె.

భయదాంభోధర గర్జితమ్ములును గుంభద్రోణమై వర్షమున్
రయమారన్ జఱతెంచు నిర్ఝర మహారావంబు, సంకీర్ణమై
ప్రియపుత్రిన్ దను మూర్ఛ ముంచినటులై బీభత్సమై తోఁప నెం
తయుఁ జింతాకులితాత్మయై జనని నేత్రద్వంద్వమున్ విప్పుచున్.

"ఏమి యమంగళం బిది ? మునీశ్వరు శక్తి మదీయ మంత్ర దీ
క్షా మహిమాతిశాయి యని శంకుదునా ? యటులైన బిడ్డపై
ప్రేమము చంపుకొంట యగు; వేయి తలంపు లివేల ? దివ్యమౌ
మామక మంత్ర తంత్ర మహిమన్ ముని వశ్యునిఁ జేసితీరెదన్."

అనుచున్ మందిర భూమి వెల్వడు మహాహంభావ ధ్వా|మాక్షియో
జననిం గాంచి కుమా రై "నాదగు నదృష్టం బింత కె ట్లున్నదో!"
యనినన్ దల్లియు "దాని కేమి కొద! నీ యానందు నెందున్నఁ దె
త్తునుబో" యంచు వచించెఁ. గూఁతునకు సంతోషంబు నిండారగన్.

సాయంకాలము వాయసం బొకఁడు పక్షు లార్చుచున్ వచ్చి 'కా
కా' యంచున్ రొదవెట్టె; నింటిపయి ఘూక మ్మొక్కఁ డత్తెత్తి వా
పోయెన్; శ్వానము మేను సాచుచు నభంబున్ జూచి 'భౌ భౌ' మనెన్
బాయంజొచ్చెను జక్కవల్ కవల దూర్వారాత్మ శోకంబునన్.

అపుడు ప్రకృతిమాత తపసి నాకర్షింప
వివిధ మంత్ర ఫల వివేక బుద్ధి
సిద్ధి సాధ్య ఫల సుసిద్ధులు. నరిమంత్ర
ఫలము లాది గాఁగఁ దెలియఁ దలఁచి.

నియతి స్నానమాడి నేలపై శయనించి
మూడు నాళ్ళు యంత్ర పూజ సలిపి
స్వప్నమందుఁ గాళి ప్రత్యక్షమై మంత్ర
ఫలము తెలుపు నంచుఁ దలఁచె మదిని.

స్వప్నమే రానిచో నశుభమ్ము సుమ్ము!
అదియ యరిమంత్ర ఫల, మాత్మ హాని కరము;
మూడు నాళ్ళైన స్వప్నమ్ము జాడ లేదు—
ప్రకృతిమాతకు మనసులో భయము తోఁచె.

"ఓ మహాకాళి! యేమి కానుండె నాకు?
తల్లి, స్వప్నమునందు ప్రత్యక్ష మగుచు;
సిద్ధి మంత్రఫలము కటాక్షింపఁ గదవె!
వలదు వల దమ్మ, అరిమంత్ర ఫలము వలదు."

అనుచు నిదురింప నడురేయి నాయమకును
దేవి కలలోనఁ బ్రత్యక్షమై వచించె
"పడఁతి నీ పూజ సందిగ్ధ ఫలము, మఱియుఁ
బరమ హింసాకర్మమయి పరిణమించు."

"దేవి దయగల తల్లి, సందిగ్ధ ఫల మ
టన్న సగము సిద్ధి ఫలమె యగును; బరమ
హింస యగు నన్న నొకకొంత హింస యగును:
భయపడఁగ నేల!" యని యెంచెఁ బ్రకృతిమాత.

తెలతెలవాఱుచుండఁ బ్రకృతిం గని "నేఁడె యమోఘ యంత్ర పూ
జలు మొదలౌ సుమీ, వలయు సాధనముల్ సమకూర్చి రంగ వ
ల్లులు వెలయింపుమమ్మ, కలలోఁ గరుణామయిఁ గాళికన్ గనం
గలిగితి"నన్న ఆమె క్షణకాలములో సవరించె సర్వమున్.

వడి శుచి స్నాతయై జడలు కట్టిన కురుల్
తడియార్చి ధౌత వస్త్రము ధరించి
ఫాల పట్టికపైని భస్మ త్రిపుండ్రమ్ము
రక్తచందనము నుగ్రముగ దిద్ది
నాగ బెత్తము, శృంగనాదమ్ము, లాతాముఁ,
బులితోలు, పంకు పేరులు నమర్చి
కకపాల శోధించి సకల వశ్యౌషధీ
లతల వాసనలు దిక్తతులఁ బఱపి

ద్వాదశకరాశి చక్రబంధము రచించి
స్వీయ నామాదివర్ణరాశిని లిఖించి
మంత్ర నామాదివర్ణ సంబంధ మరసి
ప్రకృతిమాత మందస్మిత ప్రభ వహించె.

దక్షిణకరమ్మునందు రుద్రాక్ష మాల,
కనుల నానందముని సమాకర్షణేచ్ఛ,
ఆననమ్మున మహిత మంత్రారవమ్ము,
ఆమె దీపించె దివ్య పద్మాసనమున।

కొంతతడవైన యెడ నామె కూతుఁ బిలిచి
చెంత నున్న యంజనపేటి చేతి కిచ్చి
"యంత్రపూజావసరముల నడుగుచుందు
దీన నీ వేమి కాంతువో తెలుపు" మనియె.

ఆ మహాంజన పేటిక కామితార్థ
దర్శకము గానఁ బ్రకృతి చిత్తమునఁ బొంగి,
'సురుచిరాంగుండు మౌని యెచ్చోటఁ గలఁడొ
చూచెదను గాక' యనుకొంచు వేచియుండె.

ఆదిభైరవ మంత్ర, మంబా స్తవంబు,
శతరుద్ర మంత్రంబు, శరభగీతికలు,
వీరభద్రంబును, నారసింహంబు,
వాదిగాఁ గల్గు మంత్రావళిం దల్లి

ఉత్కంఠ బతియించుచుండ, నా ప్రకృతి
"ఇది యేమి తల్లి నా కేమి కన్పడదు?"
అని వేగురింప నాయమ తేఱి చూచి
"ఔరౌర, నా కింక నాత్మ సంశుద్ధి
కుదురకో లేదు తేఁకువ పూనియుండు
వెలుపుదానను వశ్యకర యంత్రవిధుల,
అరయుమీ అంజన"మనుచు మాతంగి
నల్లరేగటి మంటి పెళ్ళ మర్దించి
గణపతి ప్రతిమ చక్కఁగఁ దీర్చి దిద్ది
తన యనామిక కోసి తద్రక్తమందు
జాతికోశ శలాక సరగున ముంచి
ప్రబల యావజ్జీవ వశ్యకరమ్ము
మహిత గాణాపత్య మంత్రాక్షరమ్ము
నీరంధ్రమును, బటుస్నిగ్ధమునైన
భుజపత్రి దళమునఁ బొసఁగ లిఖియించి
దీప ధూపాది విస్తృత పూజ నడపి
భూగర్భమున యంత్రముద్ర నెక్కొల్పి
మోదమ్ముతో శృంగనాదమ్ము నూఁదె
బ్రహ్మాండ మది ప్రతిధ్వని సేయుచుండ —

అంజన పేటికన్ ప్రకృతి యద్భుత మేదియొ తోఁపఁ దీక్ష దృ
క్పుంజముఁ జొన్పి కన్గొనియెఁ గోమల నీల సరోంబు వీచికా
మంజుల డోల నూఁగు సుకుమార శశి ప్రతిబింబమో యనన్
రంజిలు మౌని యాననము, రమ్య దృగంత సుధా నిధానమున్.

కలకల నవ్వినట్లు, కనుగల్వలు వింతగ విచ్చినట్టు; లిం
పొలయఁగ దాసినట్టు, లెదియో చెవిలోన రహస్య మూఁది న
ట్టులు, మదిలో మధూదయమటుల్ వలపుం దెలి మల్లె మొగ్గ సొం
పులు తులకించినట్లు ముని ముఖ్యుని ముద్దుల మోము తోఁచినన్.

కను లింతచేసికొని చూ
చిన కొలఁదిఁ గన త్తటిద్విజృంభణమై తో
డనె సర్వము మాయమ్మై
ముని యొక నీలాంబుదంబు పోలికఁ దోఁచెన్.

స్పష్టాస్పష్టముగాఁ దన
దృష్టికిఁ గనిపించు మౌని తీరునకు నసం
తుష్టిం జెందెడు కూఁతు న
భీష్టము తీర్పంగఁ దల్లి యిట్లని పలికెన్.

"అంజనల కంతగా నందఁడమ్మ యితఁడు
సత్య శౌచ దయా ధర్మ సాధు శీలి;
దివ్య దర్పణ మిది చూడు. దీని శక్తి
సర్వ సృష్టిప్రదర్శక సాధనమ్ము.

ముని యెం దున్నను జరజర
మన వంకకుఁ గదలి వచ్చు మసలక నీవున్
గవినది కవినట్టులుగా
వినిపించుచునుండు నాకు వికచాబ్జాక్షీ !"

అనినఁ బ్రకృతి 'వల్లె' యని యద్దమునఁ జూచి
హర్షపులక లెసఁగ నఱచె నిట్లు
"ఏమి కపిలవస్తు ! వేమి బౌద్ధారామ !
మేమి దివ్యతేజ ! మేమి శాంతి !
ఏమి బుద్ధదేవు ! దేమి సదుపదేశ !
మేమి భిక్షుకోటి ! ఏమి భక్తి ?
ఔనుగాని, ఇంత కానందముని యేడి ?..........
అదుగో ! బుద్ధదేవు నంతికమున.

# ఆ దే శ ము

బుద్ధుఁడై సకల జీవులఁ బ్రోచె సుతుఁ డంచు
మోదాశ్రు లొలుకు శుద్ధోదను వలె
'అన్న దివ్యప్రేమ తెన్ను చూపె, నటంచు
తనివొందు నందసుందరుని వలెను
'పతి జగత్ప్రభువు విశ్వప్రేమనిధి' యంచు
శోక ముడిగిన యశోధర వలె
'పిత జగత్పిత పితృప్రేమపూర్ణుఁ' డటంచు
ఊరటఁ గన్న రాహులుని వలెను

శాంత గంభీర సత్త్వ ప్రసన్నమయిన
కపిలవస్తుపుర మ్మదే. కానవచ్చు ।
బుద్ధ భగవాను నెదలోనఁ బొదివికొనుచు
బౌద్ధ తేజమ్ము నాత్మలోఁ బదిలపఱచి.

ముఖరిత విశ్వమై మధుర బోధ సుధా దివిజాపగాంబువుల్
నిఖిల మహౌఘ కర్దమ మలీమస ధాత్రికి దూఁకి క్షాళనో
న్ముఖమయి సాగివచ్చెడుఁ, గనుంగొనుఁ డయ్యెడ శీతశైలపున్
శిఖరము వోని యా సుగతసిద్ధుని బౌద్ధ విహార వేదికన్.

ఊడల మఱ్ఱి నీడల సమున్నత సైకత వేదికాస్థలిన్
గూడిన శిష్యకోటుల కకుంఠిత సంయమి ధర్మ పద్ధతుల్
వేడుక మీఱఁ బాడి వినిపించెడు గౌతమ బుద్ధదేవునిన్
జూడుఁడు, సర్వ జీవుల కశోక పదమ్మును జూపి చెప్పెడున్.

"జలము పొలమున మలఁచు కర్షకుని పోల్కి
ధనువు స్వేచ్ఛగ సారించు ధన్వి పోల్కి
శిలల నిష్టాకృతులు దిద్దు శిల్పి పోల్కి
మనసు తనయిచ్ఛ నడపు సంయమియె సుమతి.

కలయనేసిన గృహము పైకప్పునుండి
వాన చినుకులు జాఱి రాలేని యటులు
స్థిర వివేక సంపన్నుని చిత్తమందు
విషయ వాంఛలు ప్రసరింప వీలుపడదు.

బండి నీడ్చు నెద్దుల పృష్ఠభాగ మొరసి
వెంట వచ్చు చక్రమ్ములవిధము తోఁప
దుర్విచారమ్ములే చేయు దుష్టమతికి
సకల దుఃఖమ్ము లవి వెంట సాగివచ్చు.

విషయ సుఖభోగ మత్తుఁడౌ వికృత మతిని
మారుఁ డను పెనుభూతము మసి యొనర్చు
రాత్రి నిద్దుర మునిఁగిన గ్రామ సీమ
నొక్క పెనువెల్లి పైఁబడి యూడ్చి నటులు.

మల్లికా వల్లికలు కన్న మమత విడచి
వాడినట్టి పూవులు రాల్చి వైచు నటులు
భిక్షు లెల్లరు తెగఁద్రుంచి వేయవలయు
రాగ విద్వేషములు పరిత్యాగ బుద్ధి."

అను నగౌతమ బుద్ధదేవు నుపదేశాలాప మాషాఢ మా
స నవాంభోధర గర్జయై సకలతృష్ణల్ దీర్చుచున్ దివ్య జీ
వన దానం బొనరింప శిష్యతతి భావక్షేత్రముల్ ధర్మ బీ
జ నవామోదములై, ఫలోన్ముఖ మహాసస్యంబులై పొంగెఁబో,

నందసుందరుఁడు నానందంబు నొందెను;
సుందరి శాంత విస్ఫూర్తి నెసఁగె;
శారిపుత్రుఁడు సంతసంబునఁ బొంగె; మౌ
ద్గల్యాయనుఁడు మహోత్సాహి యయ్యె;
ఆమ్రపాలి 'కృతార్థ నైతి' నంచుఁ దలంచె;
అల ప్రజావతి మహాహ్లాద మొందె;
కాశ్యపుండు ప్రసన్న కళతో రహించె; న
జాతశత్రుఁడు సుప్రశాంతుఁడయ్యె;

రాహుల కుమారకుండు విరీహుఁడయ్యె;
అశ్వజిత్తుండు కడుఁ దన్మయత్వమందె;
జీవక సుభద్రు లానందసిద్ధి గనిరి;
కాని యానందముని చంద్రు కళ తొలంగె.

ఉన్నటులుండి యమ్ముని మహోదయు పాద సరోరుహంబులం
దెన్నఁడు లేని సంచలన మేదియొ తోఁచెను; బుద్ధదేవుఁడన్
పెన్నిధిఁ బాయలేని నిజు పేదవలెన్ వెడచూపు చూచుచున్
ఖిన్నత మౌని పోవఁదొడఁగెన్ మునిగాళులు నేల నూఁదుచున్.

అల శ్రావస్తి నభస్థ్సలిన్ గదలి దీవ్యద్ఘోర గర్జాతి ని
స్తుల కాలాంబుద మొక్కఁ డక్కపిలవస్తుక్షోణి బౌద్ధాశ్రమ
స్థలి గోరాడి కన త్తటిత్ప్రభలు సంధానించె, నానందు కొం
దలపున్ దెందము కందువాఱఁ, గసుగందన్ మోము పొందమ్మియున్.

శుద్ధానంద ప్రకృతి వి
రుద్ధ క్షుద్రాభిచార రోచనఁ గనియున్
బుద్ధుఁడు మిన్నక పలికెను
సిద్ధులఁ గనుగొంచు సుగత సిద్ధాంతంబున్.

"దినదినము వేనవేలుగా ధనము వోసి
జీవబలి చేసి జన్నముల్ సేయుకంటె
భక్తి యెసలాఱ నొక స్థితప్రజ్ఞుఁ దలఁచి
తన్మయత్వంబు నొందుట తగును చూవె.

ఆత్మ మౌఢ్యమ్ము గుఱుతించునట్టి మూర్ఖు
మూర్ఖు కానేరఁ డాతఁడే బుద్ధిశాలి
తనను దా బుద్ధిశాలిగాఁ దలఁచు ఘనుఁడు
పరమ మూర్ఖుఁ డటంచు గుర్తెఱుఁగ వలయు.

ధర్మ మెఱుఁగని మూర్ఖుఁడౌ తామసునకు
బ్రదుకు బ్రదుకెల్లఁ బరమదుర్భరము సుమ్ము
బడలియున్న కుంటి కెడారి నడక వోలె
నిదుర రాని రోగికి దీర్ఘనిశయు పోలె."

గౌతమమహర్షి ధర్మసంగీత రవము
భూ నభోంతర మిట్లు మార్మ్రోగుచుండ
బౌద్ధ వాటిక ప్రత్యనుస్పంద మొందె
నడక సాగక నిలిచె నానందుఁ డివల.

సరభసమైన యొక్క పెను శక్తి యదృశ్యముగా మునీశు నం
బరమున కెత్తి యాప్రకృతిమాతృ సమక్షమునందు నిల్పఁగా
బిరబిరఁ బోవుచుండె; మునివీరుఁడు సౌగత పాదపద్మ సం
స్మరణ సమాత్త నూత్న విలసత్కళ రాజిలఁ దెల్వి నందుచున్.

క్షుద్ర ప్రస్ఫుట శక్తి నిర్దళన దక్షుండై ప్రదీప్త ప్రభా
భద్రుండై పటు బంధ మోక్షణ విధా పారీణుఁడై బౌద్ధ ధ
ర్మోద్రిక్తుండై పఱతెంచి యాశ్రమ మహీజోపాంతమం దాగె వి
నిద్ర జ్ఞాన పథ ప్రదీప సుగత శ్రీపాదముల్ చూచుచున్.

శ్రావస్తి వెలివాడఁ జండాల కన్యక
దర్పణమ్మునఁ గాంచి తపసివర్యు
దుర్వారశక్తి కద్భుత సంభ్రమము లంది
చెంగటనున్న తల్లిం గనంగ
అభిచార హోమ ధూమావృతయై యామె
ముక్కున నూపిరి మొనసి యుండెఁ
అది గాంచి ప్రకృతి హాహారావ మొనరింపఁ
దల్లి బిడ్డను జేరి తనువు నిమిరి
"వెఱపు చెందఁగ నేలమ్మ వెఱ్ఱితల్లి,
వలయుచో నాదు ప్రాణముల్ బలి యొసంగి
అప్పరమమౌని నీ కప్పజెప్పు దాన"
ననుచుఁ బటుతర హోమనిష్ఠను మునింగె.

కాని యామె స్థిరత్వగరిమ చాలమిని
డబ్బాటు హోమగుండము వీడి వచ్చి
యొకకొంత విశ్రాంతి నొంది యా వెనుక
స్నానతంత్రము మూడు సంధ్యల నెఱపి

నలుఁగుబిండిని మంత్రజలము ప్రోక్షించి
ఆనందమౌని మోహనమూర్తి మలఁచి
కుంకుమ, గందమ్ము, గోరోచనమ్ము
మర్దించి చేసిన మసృణ రసాన
భుజపత్రి దళముపై మునిపేరు వ్రాసి
శ్వేతతంతువునఁ గూర్చిన యంత్రముద్ర
ప్రతిమ గుండియమీఁద బంధించి యుంచి
మాణిభద్రోదార మంత్రరాజమ్ము
పఠియించుచుండ నా పాణచి పడఁతి
ప్రళయ భైరవి తనుప్రభ దాల్చి యొప్పెః
ప్రకృతి తోడ్తోన దర్పణమందుఁ జూచి
ముని కానరాఁ డంచు మొగము చిట్లింపఁ
జండాలి సముదగ్ర చండికాకృతియై
ప్రళయాట్టహాస సంరంభంబు సూపి
హోమ ధూమజ్వాల లొడలికి సోఁక
భగభగ మంటలు పెగలు మైఁ గ్రమ్మ
సివమెత్తి సంయమస్థితి కోలుపోయి
త్రైపురాకర్షణోదాత్త మంత్రమ్ము
నుచ్చైస్స్వనంబుతో నుడువీథి యదర

పతియింప రుందుూ ప్రభంజనం బొకఁడు
మేఘమండల మొ త్తి మెఱపులు సిమ్మి,
యురుములు, పిడుగులు నురవడి నెసఁగఁ
బ్రాగ్దిశాముఖముగాఁ బయనింప సాగె.

అంత నొకనాఁడు కపిలవస్త్వాశ్రమమున
గౌతమమహర్షి శిష్యసంఘమ్ము గూర్చి
బ్రహ్మచర్య ప్రకార ముపన్యసించె
ధర్మ మధురార్ద్రి కంఠమార్దవ మెసంగ.

"మన సనెడు చిన్నపడవలో మమత యనెడి
నీరు నిండినచోఁ దోడి పారవోసి
బ్రదుకు నదిలోన నిర్వాణ పథము వట్టి
పడవ మునుఁగనియట్లు పోవలయు నరుఁడు.

మంచి చెడ్డలు పరిగణింపకయు సతము
బ్రహ్మచర్యమ్ము పూనెడు బౌద్ధధర్మ
వేత్త యొక్కఁడె నిక్కమౌ భిక్షు వగును;
బిచ్చ మెత్తెడు వాఁడెల్ల భిక్షు వగునె ?

పవనజవమును సాధుసత్త్వమ్ము నైన
యుత్తమాశ్వమ్ము ప్రేటున కోర్వ నట్లు
ధీరుఁడు వినీతుఁడును జితేంద్రియుఁడు నైన
మానవోత్తముఁ డెన్నఁడు మాట వడఁడు."

బుద్ధుం డీగతి శిష్యుల
బుద్ధులు శిక్షించి ధర్మబోధ యొనర్చెన్
సిద్ధులు, సంతత సాత్త్విక
శుద్ధులు, శుద్ధాంతరంగశోభ నెసంగన్.

వింజం బాఁకిడినట్లు శిష్యతతి తన్ వీక్షింప బుద్ధుండు తొల్
సంజన్ తోయజబంధున ట్లలరి తేజఃపుంజముల్ చిమ్ముచున్
గెంజాయల్ ఘటియించె, మింటి నడుచక్కిన్ మిత్రుఁ డేమేఘ కు
క్షిం జిక్కుల్వడెనో తమఃప్రకృతి తోఁచెన్ సత్త్వ సంత్రానమై.

కడవలఁ గ్రుమ్మరించినటు కాఱుమొయిళ్ళు నభమ్ము గ్రమ్ముచున్
వడగలి వాన నించి పటువైఖరి భీకర గర్జ సేయుచున్
బిడుగులు రాల్చుచున్ బుడమి బీటగిలన్, బెనువెల్లి పొంగులై
వడివడిఁ బాఱుచున్ గపిలవస్తువు వెల్వడెఁ బళ్ళెమంబుగన్.

నట దుల్లోల నదీ తరంగములపై నర్తించు రాయంచ య
న్నటు లానందుఁడు తూఁగియాడుచుఁ బ్రవాహంబందు శ్రావస్తి చే
క్కటికిన్ వచ్చుచునుండె, దర్పణ దిదృక్షా స్ఫీత చేతోగతి
స్ఫుట నేత్రాంబుజ యౌచు ఆప్రకృతి సొంపుల్ గుల్కుచున్ జూడఁగన్.

అలజడివడిఁ బడి వెడవెడ
కళ లుడిగెడు మౌనిచంద్రుఁ గనుగొని యెడఁదన్
గలఁతవడి శ్వపచసుందరి
పులుగడుగుచు ముకురతలము పొదిగొని చూచెన్.

పాఁతగలి జీవ మెడలిన
చూతము పెనువెల్లి సుడియుచున్ వచ్చినటుల్
గౌతము సన్నిధి వాసి య
చేతనుఁడై మౌని ప్రకృతిచెంగటఁ బడియెన్.

అద్దివాకీర్తి కన్యక యదరిపడుచు
దిగ్గునన్ లేచి మునిముఖ్యుఁ దేరిచూచి
తొంటి యానందకళలెల్లఁ దొలఁగిపోయి
నెత్తురులు చిమ్ము నెమ్మోము నెత్తి చూచె.

"మునుపు నా ప్రోల నంజలిపుటి ఘటించి
నవ్య ధర్మోక్తు లాడిన నాఁటి చెలువు,
నాఁటి సుందర దరహాస నవనవత్వ,
మిప్పు డేమయ్యె నయ్యయో, యెంత వింత ?

ప్రణయ శూన్యమ్ము, శవ సన్నిభమ్ము నైన
యీ వికారపుఁ దనువు నీక్షింపఁ జాల;
చాలు చాలమ్మ నీమంత్రజాల మింక ;
జీవబలు లేల ? యీ క్రూరచింత లేల ?"

అనుచుఁ దత్కన్య తల్లివై పరసె; నంత
ఆత్మజప్రీతికై యాహితాగ్నియందు
ఆత్మశక్తులు బలివెట్టి యసురుసురగు
నామె కాయమ్ము కంకాళ మగుచుఁ దోఁచె,

చిలుక లేని పంజరమట్లు చెన్ను తరిగి
దీపమే లేని గృహమట్లు తేజ ముడిగి
గాలి కూఁగెడు నామె కంకాళ మొరసి
హోమ ధూమానల జ్వాల లొత్తుకొనియె.

ప్రకృతి హృది నొక్క ప్రబల విరక్తి భావ
కీల యుదయించెఁ; జిత్తవైకృత మడంగ
నసువు లెడలిన యమ్మకై యార్తిఁగనదు;
చెదరిపడిన సంయమిఁగూర్చి చింత పడదు.

కనులు వీనులు ఘ్రాణమ్ము తనువు జిహ్వ-
అన్ని యుండియు లేనట్టు లయ్యెఁ బ్రకృతి;
ఐంద్రియస్థితి సందిగ్ధమైన యపుడు
ఇంద్రియ వికార మను మాట యేల తడవ?

నిస్తరంగకమైన మున్నీరు, స్పంద
శూన్యమైన హ్రదమ్మును, శుద్ధమైన
స్ఫటికఖండమ్ము నా నొప్పు ప్రకృతి వెలిఁగె
కడకు నిర్వాతమగు దీపకళిక వోలె.

మింట నుఱుములు, మెఱపులు, మేఘపటలి,
మంటిపై వెల్లువల పొంగు మాయమయ్యె!
జగము కందెర తెఱచిన చాయ తోఁచె;
విరిసె నెల్లెడఁ దొలిసంజ వెలుఁగు వెల్లి.

బటువుగా బ్రహ్మాండ బౌద్ధభిక్షువు మేనఁ
జుట్టిన చెంగావి పుట్ట మనఁగ
క్రమముగా గగన గౌతమసిద్ధుఁ డూడ్చిన
లలిత లోహిత జటావలి యనంగ
హితవుగా విశ్వ సౌగతమౌని జగతి మే
ల్కొల్పఁ జాచిన కరాంగుళు లనంగ
నెనరుగా భువన బుద్ధనయజ్ఞుఁ డార్తులఁ
దేర్పఁ బంపిన కృపాదృష్టు లనఁగ

సకలజగములు మైత్రేయ శాంతమూర్తి
చల్ల చల్లని చాయలఁ బల్లవింప
చిత్రమైనట్టి తొలిసంజ జిలుఁగు వెలుఁగు
లల్లనల్లన నవనిపై నవతరించె.

ఆ జిల్గుంజిఱువెల్గులే యమృత తుల్యంబైన దివ్యౌషధీ
రాజంబై బహిరంతర ప్రకృతి శారశ్యంబు పోనాడి, ప్రా
ణౌజస్స్ఫూర్తి ఘటింప గౌతముని శిష్యుం డాత్త జీవత్కళా
రాజద్దివ్యతనూ విలాసుఁడయి నేత్రద్వంద్వమున్ విప్పెఁబో.

ప్రకృతి నీరస నిర్వికారమ్ము లైన
చూపులం జూచె మునిలోక సుందరాంగు;
నెల్ల ప్రణయప్రభావమ్ము లెడలి యామె
స్నేహశూన్య ప్రదీపికా స్థితి వహించె.

జన్మచే నామె నంతావసాయిని యని
లోకు లాడిన నాడిరి గాక ! నేఁడు
సకల బంధ విముక్త సత్ప్రకృతియైన
ఆమె యంతావసాయిని యగుట యెట్లు ?

బంధమోక్షణ పడసినఁ బడయకున్న
సకల జీవులు నంతావసాయులె కద ?
కాని సుగతుండు సుస్నేహ గౌరవమున
జగము వెలిగించు నధ్యవసాయి యగుచు.

విశ్వదీపిక స్నేహాభివృద్ధి మనుచు
బౌద్ధసిద్ధుఁడు ప్రకృతి సంభవములైన
ప్రేమ వైరాగ్యములకు నిర్లిప్తుఁ డగును,
కాన ఆనందముని యుదాసీనుఁ డయ్యె.

సత మానంద ప్రకృతుల
గతు లరసెడు గౌతమర్షి క్రమోదాత్త
శ్రుతి మధుర సూక్తు లంతటఁ
బ్రతిశబ్దం బీన గగనభాగము వించెన్.

"విహరింపుడీ మీరు విశ్వభిక్షావాటి
నకుటిల ప్రణయ భిక్షుకులు గాఁగ,
పూరింపుడీ మీరు భువన భిక్షాపాత్ర
ప్రేమాన్నదాన సంప్రీతి గాఁగ,
చరియింపుడీ మీరు జగతీ కుటుంబాన
పరిణత ప్రణయ సోదరులు గాఁగ,
సాగింపుడీ మీరు శాంత సౌగత యాత్ర
పుడమి బౌద్ధారామభూమి గాఁగ,
ప్రకృతి నొదవెడు రాగ విరాగములకు
వికృతి వొందని యానంద విమలమతికి
శరణమగు బౌద్ధధర్మమ్మె, శరణ మగును
ప్రణయ పరితప్త నీరసప్రకృతి కైన."

అమ్మధురార్థ మా ప్రకృతి యాత్మకు ప్రేఁగయి తద్విరక్త చి
త్తమ్మునఁ గ్రొత్తదౌ ప్రణయధర్మము నిర్మల భావ పూర్ణమై
క్రమ్మకొనంగ, ఆమె మునిఁ గన్గొనె; మౌనియు నట్టిదైన నె
య్యమ్మున నామెఁ గాంచుచు బయల్వెడలెన్, దను నామె వెన్కొనన్.

అంత వారల కత్యంతహర్ష మెసఁగ
కనుల ముందఱ అల తథాగతుఁడు తోఁచి
హస్తమును జాచి ప్రకృతిగేహమ్మునందు
ఆత్మ కలఁగెడు నొక్క దృశ్యమ్ము చూపె.

ప్రాణబలిచేత కలుషమై పాడువడిన
హోమవేదికపైఁ బడియున్నయట్టి
ప్రకృతిమాత యెమ్ముల ప్రోవుపైన నొరగి
కంటఁ దడివెట్టు నాదూడ కానుపించె.

మునియుఁ బ్రకృతియు నా దూడఁ బొదివితెచ్చి
ప్రణయ వాత్సల్యముల మెయి పుణుకుచుండ
బుద్ధదేవుండు మెలమెల్లఁ బోవుచుండె
"జీవులెల్లరుఁ బ్రణయోపజీవు" లనుచు.

చల్లని తండ్రి, మంచుమల
సామి "తథా"స్తని పల్కినట్లు పైఁ
జల్లెఁ దుషారబిందులు; వి
శాల తదీయ దరీముఖంబుగా
నల్లన మ్రోఁగి, గౌతమ మ
హర్షి వచశ్శ్రుతి విశ్వపీథులం
దెల్లెడ మాఱుమ్రోఁగె ద్రవి
యింపఁగ రక్కసి ఱాతి గుండియల్.

సమాప్తము

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 3 | 3 | లేమొలక లెండి | లేమొలక లెల్ల |
| 10 | 3, 4 | నడవఁదడయు | నడుపఁదలఁపు |
| 16 | 14 | గళమొప్పఁగ | గళమెత్తియు |
| 19 | 14 | వ్యాచిక్రింస | వ్యాచిక్రంస |
| 20 | 3 | కౌన నశక్తుఁడై నిలువ | కౌనక స్థిరదృష్టిఁజూడ |
| .. | 8 | పరిభ్రమింపఁగన్ | నపోహసేయుచున్ |
| 44 | 15 | తనను | తన్ను |
| 48 | 2 | కానిరామి | కానరామి |
| 51 | 15 | వాత్సల్యముతో | వాత్సల్యమ్ముతో |
| 58 | 10 | కుండెటికూన | కుందెటికూన |
| 60 | 5 | అయ్యోయో | అయ్యయో |
| 83 | 9 | మోక్షణ | మోక్షము |

